# ఆధునికాంధ్ర వాఙ్మయం—తరవాయి

### నాళం కృష్ణారావుగారివి రు. అ.

శోభనచినుకులు ౦ ౮
...లతరగలు ౦ ౮
...గీతము ౦ ౨
...డిలేడి ౦ ౨
...ద్దు ౦ ౪

### వూజాపుష్పమాలవారివి

...కిరవు ౦ ౮
...ష్పబిందువు ౦ ౮

### ...వుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారివి

...్యాససంగ్రహం ౩ ౮
...ద్యచింతామణి ౧ ౮
...లక విశరణ్యాము ౧ ౮
...్యసావళి ౧ ౦
...౦్ర విభిషక్కుల భాషాభేషజము ౧ ౦

### వ్యాసకుటీరంవారివి

...న్మభూమి నాటిక ౦ ౪
...మాజంలి—పంచమదంపతుల చరిత్రం ౦ ౫
...భోదయము ౦ ౩
...వివేకానంద సందేశము ౦ ౨
...గుణాకరము ౦ ౧౪
...లిక ౦ ౧౦
...త్రజ్యోతి ౦ ౮
...ధ్య ౦ ౬

### ...డన్నవ లక్ష్మీనారాయణగారివి

...యమరాలు ౧ ౦
...గీతవాపసాని ౦ ౧
... ౦ ౧
...వతిరంగాలు ౦ ౧
...రజ. నాటకము ౦ ౧

### ...ల వేంకటేశ్వరకవిగారివి

...ంగము ౦ ౧౨

### ...లాకొండ పత్రికవారివి

...కొండకవుల సంచిక ౨ ౦
...ల విషాదము ౦ ౧౨
...నిర్ణయచంద్రిక ౧ ౪
...రణము ౦ ౬
...లు రాజవంశావళి ౦ ౨
...ఫ్ ౦ ౧ ౬

### ...రేమండ రామారావుగారివి

...ము విద్యాచరిత్రము ౦ ౧౨
...్వాచార్యులవారి చరిత్ర ౧ ౦

### భావరాజు వేంకటకృష్ణారావుగారివి

విదేశయాత్రికులు—ప్రాచీనాంధ్రదేశము ౧ ౪
ప్రాచీనాంధ్రనౌకాజీవనచారిత్రం ౧ ౦

### కవితాసమితివారివి

శైశాఖ—వార్షికసంచిక ౧ ౦
ఉత్కలపతనము నాటకం ౦ ౧౨
ప్రభవ—ఖండకావ్యాలు ౦ ౮
మాతృపూజ పద్యఖండాలు ౦ ౪

### స్థానాపతి రుక్మిణమ్మగారివి

పూలమాల—ఖండకావ్యాలు ౦ ౪

### ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారివి

వ్యాసావళి ౦ ౪
తెనుగు వీణ, పాటలు—పద్యాలు ౦ ౨

### కూచి నరసింహంగారివి

ఆత్మసంయమము—అమితవిషయాసక్తి ౦ ౬
అనుబంధము ౦ ౩

### నడింపల్లి వేంకటహనుమంతరావుగారివి

పాహసిక—నవల ౦ ౧

### నహదేవ సూర్యప్రకాశరావుగారివి

మునిమాపు ౦ ౧౨
వకుళమాల ౦ ౧౨

### శ్రీ. స్వర్ణవల్లిగారివి

వినోదశిల్పము ౧ ౪

### ఆంధ్రరత్నగ్రంథమాలవారివి

సుందరి ౧ ౦

### మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి

చతుర్దశమనుచరిత్ర ౦ ౮
సుభాషితములు ౦ ౧

### పార్నంది రామశాస్త్రిగారివి

శ్రీ మహాభారత విమర్శ ౦ ౮

### గాయనం శేషగిరిరావుగారివి

కోతనమూనా (నాటకం) ౦ ౧౨

### రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారివి

నాటకోపన్యాసములు ౦ ౧౨

### సాహితీ సమితివారివి

సఖ. మొదటిసంపుటం. నాలుగు సంచికలు. కాలికోబయిండు. ౩ ౧౨

### శ్రీ. శఠకోపాచార్యులుగారివి

జగత్కథ (వెల్సు వరల్డు హిస్టరీ) ౩ ౦

### మొసలికంటి సంజీవరావుగారివి

బక్సారుయుద్ధము చరిత్ర ౦ ౧౨
ఔరంగజేబు పాదుషా ౦ ౧౨
హిందుశాసుకథలు ౦ ౫

### మునిమాణిక్యం నరసింహారావుగారివి

కాంతం కథలు ౧ ౦
నేనూ మాకాంతం ౦ ౪
వక్రరేఖ ౧ ౦
ఉపాధ్యాయుడు ౦ ౮

### రెం. లక్ష్మీనరసింహంగారివి

హృదయవిహంగము ౦ ౪

### నడింపల్లి జగన్నాథరావుగారివి

ఆంధ్రమహాసామ్రాజ్యము (సాదా) ౧ ౪
క్యాలికో ఉత్తమప్రతి ౨ ౮
Age of Mahabharata 1 0

### చలికాని సత్యనారాయణగారివి

జపగంటలు ౦ ౮
రహస్యలేఖ ౦ ౮
చక్రపాణి ౦ ౮

### గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివి

వోటు ౦ ౧౦
మూర్ఖరాజు ౦ ౪
నీతిధర్మము ౦ ౪
సంపూర్ణస్వరాజ్యము ౦ ౪
శ్రీరామచరిత్ర ౧ ౮
ప్రపంచచరిత్ర (గ్రీసు)
౧ మొదలు ౩ భాగాలు
భాగం ౧కి ౦ ౮
నాలుగవ భాగము హాజరులేదు
Neglected Emperorpoet 0 8
Spiritual Swadesi 1 0
Age of Vemana 0 6

### మార్కండేయభవనం వారివి

సచ్చిదానందం (యూనివర్సిటీ పోటీకి వెళ్లిన నవల) ౧ ౦
కథాకావ్యము (పద్యాలు) ౦ ౧౨
కథాకావ్యము (వచనం) ౦ ౧౨

### వెంపటి సత్యనారాయణగారివి

అక్బరు సార్వభౌముడు ౦ ౮

...యువారు. కలాభివర్ధనీ పరిషత్తు. కలబరగి వారి యింట్లో, ఇన్నీసు పేట రాజమండ్రి అని రాసికోవాలి.




సంపుటము ౬ రాజమహేంద్రవరము ౧౬ సెప్టెంబరు ౧౯౩౯ ౭ వ సంచిక

# శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు

ఇన్నాళ్ళకు శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారిని గురించిన యీరచన ప్రకటించగలిగినందుకు చాలా ఆనందిస్తున్నాను.

ఇది పంతులుగారి మేనల్లుడుగారే రాసిపంపడం ప్రబుద్ధాంధ్రకు విశిష్టత కలిగించింది.

పదిహేను రోజులకిందట, పంతులుగారిని, రాజమహేంద్రవరం రప్పించి ఫొటో తీయించిననాడు హఠాత్తుగా నాకు కలిగిన వొక సుఖస్వప్నం మనవిచేస్తున్నాను.

మొన్న మొన్ననే, మద్రాసులో, ఇది విని, చారిత్రకపరిశోధన నిపుణులు డాక్టరు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యపంతులు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగార్లూ, భారతి సంపాదకులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యపంతులుగారూ చాలా వుత్సాహంతో ఆమోదించారు. నిన్ననే, యిక్కడ, చారిత్రకపరిశోధనదక్షులు శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుపంతులుగారూ, ఇప్పుడిప్పుడే చారిత్రకపరిశోధనలో అడుగు పెట్టిన శ్రీ గుండుపల్లి జానకిరామచౌదరిగారూకూడా చాలా ఆనందంతో అంగీకరించారు.



అసలు సంగతి యేమిటంటే?

శ్రీ వీరభద్రరావుపంతులుగారు, కీకారణ్యం ఛేదించి మన ఆంధ్రుల చరిత్ర రచించిన జాతీయనిర్మాతలు. ఇటీవల ఆంధ్రచరిత్ర రచనలోనూ, ఆంధ్రచారిత్రకపరిశోధనలోనూ వ్యగ్రోత్సాహులైన అనేకాంధ్రయువకులకు మార్గదర్శకులు. గురువు లనిన్నీ చెప్పదగినవారు.

డబ్బుకోసం గాని. కీర్తికోసం గాని కాక, "ఇది నాజాతి. దీనికి ప్రకాశం కలిగించా" లన్న ఆవేదనతో వీరభద్రరావుపంతులుగారు చేసిన ఘనకార్యం యిది.

ఈ సందర్భంలో శ్రీ పంతులుగారు వసతివాసాలు కోల్పోయినారు. ఆరోగ్యం కోల్పోయినారు. జీవితం అంతా ధారపోశారు.

పైగా నిందలు, దూషణలు. ఆరోపణలు, బెదరింపులు, అసూయ విమర్శనలు, తర్జనభర్జనలు—సామాన్యంగా మనిషికి పతనం కలిగించే ప్రతికూలశక్తుల కన్నింటికీ గురి అయినారు.

కాని పంతులుగారు చలించలేదు. అడుగు వెనక్కి వెయ్యలేదు. కలం విడిచిపెట్టలేదు. ఒంటినిండా గాయాలు తిని కూడా ప్రతివీరుణ్ణి కూలగొట్టి, విజయలక్ష్మి మెడలో గెలించిన పూలదండతోనూ రక్తసిక్తమైన భీకరఖడ్గంతోనూ పాలికలవలె నిలిచి, ఇంకా ప్రతివీరుల నాహ్వానిస్తూనే వున్న మహాయోధుడులాగ ప్రకాశిస్తున్నారు పంతులుగారు.

వయస్సు అరవై దాటింది. కాని శరీరం యేమీ సడలలేదు. వడికవడి కొంచెం కూడా తగ్గలేదు. చూపుల నైశిత్యం యథాపూర్వంగానే వుంది. దేశమూ, జాతీ అవకాశం కలిగించడం లేదు; గాని, లేకపోతే, పంతులుగారు, కలం పుచ్చుకున్నా రంటే ఇవాళ కూడా రోజుకి దస్తా కాగితాలు అమూల్యమైన విషయాలతో నింపి మనమీద పడెయ్యగలరు.

అయితే; ఇలాంటి మార్గదర్శకుని, ఇలాంటి ఆచార్యుని, ఇలాంటి జాతీయ నిర్మాతను, ఇలాంటి యోధుని, ఇలాంటి విజ్ఞానఖనిని మనం

అని కూడ అనిపించినారు. మరికొందరు మండలిపోషకత్వము వదలుకొనెద మనినారు; కాని వీరభద్రరావు పంతులుగారు గాని, లక్ష్మణరావుపంతులుగారు గాని యేమియు జంకలేదు. లక్ష్మణరావుపంతులుగారు విమర్శనములకు, ఖండనములకు స్వాగత మిచ్చినారే; గాని అభిప్రాయములు మార్చుకోవలసిన దని వీరభద్రరావు గారిని ఒత్తిడిచేయలేదు. సలహాలు కూడా చెప్పలేదు. అసలు, లక్ష్మణరావుగారికి ఈచర్చలో భేదాభిప్రాయమున్నట్టు గాని, లేనట్టు గాని యెక్కడను బయలుపడలేదు. చిన్నె లయిన కనవడలేదు. మండలి సభ్యులలో తక్కినవారుగూడ ఈచర్చలవలన తమకు గలిగిన ఆర్థిక నష్టాలు సంతోషముతో భరించిరే గాని, వారు కూడా వీరభద్రరావుగారివిషయమున ఏమియు అసంతృప్తిగాని, ప్రాతికూల్యము గాని కనబరచలేదు. వీరభద్రరావు గారితో తమకు గల స్నేహమును గాని, వారియెడల తమకు గల గౌరవభావమును గాని ఆసభ్యు లెవరును ఎంతమాత్రమును కలుషితములు చేసికొనలేదు. అయినను వీరభద్రరావుపంతులుగారు, స్వప్రమాణముగ తాము చేసిన నిర్ణయములు వదలుకొనలేకయు, తమ గ్రంథము ప్రకటించుటవలన ఉత్తమ వాఙ్మయము తయారు చేయుచున్న విజ్ఞానచంద్రికాగ్రంథమండలి కెట్టిదెబ్బయు తగులకూడదనియు మూడవభాగము అన్యత్ర ప్రకటించినారు.

ఎన్నికష్టములు వచ్చిననూ, విఘ్నపరంపరలు సంభవించిననూ, నిర్భరదారిద్ర్యపీడ ననుభించెడు స్థితిగతు లేర్పడిననూ, ధైర్యము విడువనొల్లక ధృత్యున్నతోత్సాహులై, స్వయంసహాయమునందును సర్వేశ్వరసంకల్పమునందును భారము వేసి, కృతకృత్యు లగువఱకూ నిద్రపోవని ప్రజ్ఞానిధి వీరభద్రరావుగారు. పదవులకొఱకును, ప్రతిష్ఠకొఱకును, ప్రాకులాడక ప్రబుకనెంచిన నిరాడంబరజీవి వీరభద్రరావుగారు. ఒకరికి చేజాచి, రొకరియాజ్ఞకు లోబడి స్వలాభసిద్ధికై, సిద్ధపడెడు సామాన్యమానవకోటిలో జేరని పురుషసింహాలు వీరభద్రరావుగారు.

ఆంధ్రదేశీయులు వీరభద్రరావుగా రొనర్చిన భాషాసేవకు, తమ కృతజ్ఞతాసూచనపూర్వకముగ, కర్నూలు జిల్లా నంద్యాలలో రాధాకృష్ణపండితుని యధ్యక్షతను, జరిగిన ఆంధ్రమహాసభలో, "ఆంధ్రచరిత్రచతురానన" బిరుద మొసగిరి. తరువాత రెండేండ్లక్రిందట చెన్నపురి ఆంధ్రపౌరులు వీరికి విసతిపత్రము సమర్పించి, వీరొనర్చిన భాషాసేవయు, దేశసేవయు నుగ్గడించిరి.

మదరాసు, ఆంధ్ర, విశ్వవిద్యాలయములలో పట్టపరీక్షాసిద్ధులకే గాని తదితరులకు ఉద్యోగపదవులందు తావు లేదు. కాని వీరభద్రరావుగారు వ్రాసిన, 'తిక్కనసోమయాజి,' 'తిమ్మరుసుమంత్రి,' 'శ్రీనాథకవి,' 'అళియరామరాయ' లాదిగ్రంథములు పట్టపరీక్షలకు పఠన గ్రంథములుగా మాత్రము నియమించుట కొంతవరకు గ్రుడ్డిలో మెల్లగా నున్నది. భారతిపత్రికాసంపాదకులు తమ సంపాదకీయవ్యాఖ్యలలో నొకపుడు, వీరభద్రరావుగారికిని, వేంకటశాస్త్రి (చెళ్లపిళ్ల) గారికిని విశ్వవిద్యాలయమువారు బిరుదముల నిచ్చి సత్కరించిన సమంజసముగ నుండు నని వ్రాసిరి; కాని వారి మాటలు వినువా రున్నట్లు కనబడలేదు.

వీరభద్రరావుగారు వృద్ధులైననూ, ఆంధ్రసాహిత్యసేవ కింకను సంసిద్ధులై యున్నారు. ఈమహాపురుషునికి భగవంతు డాయురారోగ్యముల నిచ్చి వీరి పరిశోధనఫలితముల నింకను ఆంధ్రదేశ మనుభవించు నట్లు చేయుటకు సర్వేశ్వరుని వేడుకొనుచున్నాను.

ఈశ్వరదత్తు

---

## రెవ్యూ నిమిత్తం పుస్తకాలు పంపేవారు ఈసంగతి గుర్తించకోరుతాము

రెండు ప్రతులు వచ్చిన పుస్తకమే రెవ్యూ చెయ్యబడుతుంది. ఇతర్లచేతకూడా రెవ్యూ చేయిస్తాము. ఎలాంటి సందర్భంలోనూ పునర్విమర్శలు ప్రకటించము. ఇందుకు అంగీకరించలేనివారు పుస్తకాలు పంపవద్దు.

సంపాదకుడు

# వెల్లిన కొద్దీ రెట్టింపు వడ్లగింజలు

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

"రాజద్వారే రాజగృహే సర్వదా దిగ్విజయోస్తు. వేదోక్తం పరిపూర్ణ మాం—"

"పో—పో. మళ్లీ యిక్కడికి వచ్చావూ? ఎవరోయ్ జవాన్లూ!"

"చిత్తం, మేమడ్డు పెడుతూనే వుండగా, జలగలాగ జారి లోపలికి వచ్చేస్తున్నారు బాబయ్యా"

"దివాన్జీవారి దర్శనానికి—"

"చాల్చాలు, అంగాస్త్రపు గుడ్డా నువ్వూ—చూస్తా రేమోయ్!"

"రావయ్యా! మంచిబ్రాహ్మడివే........."

"నేను డబ్బుకోసం—"

"వూరుకో, వూరుకో. ఇంకా తెల్లపోయి చూస్తూ—వినపడదుటోయ్!"

"చిత్తం చిత్తం"

జవానులు వెనక్కి లాగుతూ వుండగా, ఆబ్రాహ్మడు, ముందుకి రావా లని గింజాకుంటూనే వున్నాడు.

సరిగా యీసమయానికి, దివాను, మసలందుమీద పూర్తిగా పడుకు కూచుని "ఏమిటా అల్లరి?" అన్నాడు.

"ఎవరో పిచ్చిబ్రాహ్మడు, ఏలినవారి దర్శనానికి—"

"ఒక రూపాయ యిచ్చి పంపెయ్యలేకపోయావు టయ్యా!"

"డబ్బక్కరలేదు టండి"

"మరేం కావాలిట?"

"చెప్పలేదండి"

"అడిగావా నువ్వు?"

"లే—ద్—ం—"

"............................"

"ఒక అంగాస్త్రపుగుడ్డ కట్టుకుని, మరో అంగాస్త్రపు గుడ్డ కప్పుకుని—"

"అయితే?"

"పిచ్చివాడూ మహాప్రభూ!"

"ఎదటికి రప్పించు"

"చిత్తం—చిత్తం"

మరుక్షణంలో, ఆబ్రాహ్మడు, తానేదారుకేసి కొరకొర చూస్తూ, దివాన్జీయెుకటికి వచ్చి చేతులు జోడించుకు నుంచున్నాడు.

"ఎవరయ్యా నువ్వూ?"

"మా యింటిపేరు తంగిరాలవారు. నాపేరు శంకరప్పండి"

"ఏమిటి పని?"

"మహారాజులుంగారి దర్శనం చేద్దా మని వచ్చానండి"

"ఏమిటీ?......ఈవేషంతోటే?"

"చిత్తం—చిత్తం. ఒక విద్యలో నేను చక్రవర్తిని. విద్యలకు వేషం అక్కరలేదండి"

"ఏవిద్యలో నీచక్రవర్తిత్వం?"

"చదరంగంలో నండి"

"............................"

"తమకి ఆశ్చర్యం అక్కరలేదు. బ్రాహ్మలే కాదు, వెలమలు, తురకలు, చివరికి క్షత్రియులు—ఎవరూ—ఎక్కడా నా ఆట కట్టగలిగినవారు లేకపోయారండి"

"అబ్బా!........అలాగేం?"

"ఆత్మస్తుతి మంచిది కాదు కానీ—ఒక్కొక్కచోట అది చాలా అవసరంగానే వుంటుందండి. పెద్దాపురం మహారాజులుంగారంటే చదరంగం ఆటలో నిధి అని దిగ్దంతులు ఘోషపెడుతూ వుండడంవల్ల ఒక్కమాటు—వొక్క ఆట—వారితో ఆడాలని—"

"సాధ్యమా?"

"ఏమీ?"

"ఇక చదరంగం ఆడకూడ దని నిశ్చయించుకున్నారు ప్రభువు"

"ఎందేతో?"

"తగిన వుజ్జీ దొరక్క. చివరికి ఆట కట్టడం మాట దేవు డెరుగును, నాలుగెత్తు లేనా వెయ్యగలవాడు కనపడలేదు పృథివిలో"

"చిత్తం"

"కళ్లు తెరవనివాళ్లతో ఆటేమి టని నిరాశ చేసుకున్నారు మహారాజులుంగారు"

"నాతో ఆడి చూడకుండానే?"

"నువ్వేం ఆకాశంమీదనుంచి వూడిపడ్డావా యేమిటి?"

"ఇంకా సందేహమాండి?"

"అబ్బో!"

"తంగిరాల శంకరప్పతో చదరంగం ఆడి జయించగలవాడు ఈక్షణందాకా భూమిమీద పుట్టలే దండి"

"మహాబాగా కోస్తావే?"

"చిత్తం—చిత్తం. కత్తి చేతిలో వున్నప్పుడు కొయ్యకపోవడం యెలా వస్తుంది మహాప్రభూ?.........అయితే: మొండిపట్టు పట్టి, ఆటలో కూచుని వోడిపోతే, మహారాజులుంగారు, వచ్చినవాడి తల కొట్టించి కోటకొమ్ములకు కట్టించడానికి శపథం పట్టారని తెలుసు. తప్పకపోతే అందుకు సిద్ధమే అని నిశ్చయించుకునే వచ్చానండి"

"అంత సాహసం యేం? పెళ్లయిందా?"

"ఇంటావిడ కాపరం చేస్తూనే వుందండి"

"కలో గంజో తాగుతూ పెళ్ళామని, పిల్ల లనీ—యేదో నలుగురితో బాటుగా వుండక యీపిచ్చివేషం యేమయ్యా నీకూ?"

"విద్యల్లో వుండే వ్యసనం అలాంటిది. అది అందరికీ అవగాహన కాదండి. విద్యవ్యాప్తి వుంటే యిక తిండి అక్కరలేదు. నిద్ర అక్కరలేదు. గుడ్డకూడా—"

"పెళ్ళామా!"

"నిద్రాహారాలు లేకపోయాక యిక పెళ్ళాం యెందుకూ?... ...........కాని ప్రాజ్ఞత రాకముందే నాకు పెళ్ళయిపోయింది. ఇల్లాలు రావడమూ, చదరంగపు వ్యసనం హెచ్చిపోవడమూ వొక్కమాటే—"

"డబ్బు సంపాదించమని రమ్మని యింటావిడ తరిమిందన్న మాట!"

"అదీ వుంది. తమరు కొంతముట్టుకు బాగానే కనిపెట్టారు"

"ఇంకా యేమిటి?"

"ఇన్నళ్ళూ అలాగే వుంది ........ప్రతీరోజూ యెవడో వొకడు వస్తూ వుండడమూ, నాలుగో యెత్తు వెయ్యలేక తెల్లపోతూ వుండడమూ—ఇక్కడ. మహారాజులుంగారికీ, అక్కడ, నాకూ వొక్కలాగే—"

"ఏమిటీ అగుగుపోలికా?"

"చిత్తం—చిత్తం. సత్యం అన్నది వొక్కొక్కప్పుడు యిలుగానే వుంటుందండి"

"........................"

"అక్కడ యెలాంటివాళ్ళూ వొక్క అంతస్థులోనే వుంటారండి......ఇంతకీ తగిన ప్రత్యర్థి దొరక్క, యిక్కడ, మహారాజులుంగారికీ విసుగే వచ్చింది. అక్కడ, నాకూ విసుగే వచ్చింది. దీన్ని తమ రేమంటారూ?"

"నీమాట వొక్కటేనటయ్యా?"

"అమాటో మరోమాటో అనడానికి అసలు మహారాజులుంగారు........తమరు, వారి దర్శనం చేయించడానికి చాలిన వారు. తమ దర్శనానికి కారణం యిదీ"

"ఆలోచిస్తాములే.........వెళ్ళు"

"........కట్టుకోడానికి గుడ్డ కూడా లేనివాణ్ణని తమకు ప్రత్యక్షమే; కాని నాప్రజ్ఞ చూపించడం తప్ప మరేమీ కోరిక లేదు. ఈవిషయంలో తమ కేమీ సందేహం అక్కరలేదు. ఓడిపోతే నాతల తీసుకోడానికి కూడా ఏమీ ఆక్షేపణ లేదండి"

"అదెలాగా తప్పదు"

"తెలుసుకోగలిగితే అదీ వొక గౌరవమే నండి"

"ఇంకేం?......పరిపూర్ణజ్ఞానం కలిగిం దన్నమాటే"

"చాలామంది పెద్దలు కూడా యిలాగే సెలవిచ్చారండి"

"అయితే, యిక దయచెయ్యి"

"......మళ్ళీ—"

"మేము కబురుచేస్తాములే"

"నాబస—"

"కావా లంటే నీ దర్శనమే దొరక దంటావా యేమిటి?"

"శంకరప్ప అంటే—"

"ఇక కబుర్లు......ఏయ్! జవాన్!"

"చిత్తం బాబయ్యా! నడవ్వయ్యా నడు"

జవానులు శంకరప్ప రెక్కలు పట్టుకున్నారు. శంకరప్ప దివాన్జీకేసి కోరచూపులు చూస్తూ వెళ్ళిపోయాడు.

ఇదంతా అయిన తరవాత, తానేదారు, గుమ్మంలోకి వెళ్ళి, తానుదివాన్జీకి కనబడకుండా వుండేటట్టు చూసుకుని, శంకరప్పకేసి చూస్తూ మీసంమీద చెయ్యివేసుకున్నాడు.

౨

"ఏం జరిగింది నాయనా!" అంది పెద్దమ్మ. "వ్యవహారం యెదురుతిరిగిం" దన్నాడు శంకరప్ప.

జరిగిం దంతా విని, పెద్దమ్మ, తనని దద్దమ్మకింద కట్టేసిం దని నిశ్చయించుకున్నా డతను"

"నిజానికి దురుసుమాటలే విడిచిపెట్టాను"

"ముందు మాట యేమాలోచించావూ?"

"మహారాజుతో వొక్క ఆటైనా ఆడాలి; కాని—"

"స్స! ముందుమాట అడుగుతున్నాను"

"నాకర్థం కావడం లేదు"

"మరి దివాన్జీదగ్గర అంత మెరుసుగా యెందుకు మాట్లాడావు?"

"ఆపెద్దమనిషి మొదటే హాళవలోకి దిగాడు. అదివరకే తానేదారు, జవాన్లచేత గెంటించడం నన్ను రెచ్చగొట్టివుంది"

"దివాన్జీ కొంచెం గర్వ మబ్బుడులింగడు. అయినా యీతాబేదార్లు, తమ తాహతేమిటో, తమ బతు కెలాంటిదో తెలిసి మసలరు"

"......................"

"నీమాట అలా వుండనియ్యి. చదరంగం ఆడేవాడు దొరక్క మహారాజుకి మతిపోయివుంది"

"అంతవరకూ వచ్చిందీ?"

"అసంగతి దివాన్జీకి తెలుసు...............తల యిచ్చెయ్యవలసివచ్చినా సరే అని నువ్వు సిద్ధపడివచ్చినందుకు సంతోషించడానికి బదులు, దివాన్జీ, తెలివితక్కువ—"

"పూర్తిగానూ"

"అబ్బ!............చివరికి ఫలం?"

"నాప్రజ్ఞ—"

"దిబ్బా దిరుగుండడమూనూ. విద్వాంసుల మంటూ వచ్చేవాళ్ళని చాలామందిని చూశాను; కాని అంతా యిలాగే, యింగిత జ్ఞానం లేక—"

"అసలే మతిపోయివున్నాను. పైగా—"

"అయితే మరి విను. దివాన్జీ తెలివితక్కువతనంవల్ల, మహారాజుకి, తగినవాడితో ఆడే యోగం తప్పిపోయింది"

"అలా అన్నావా?"

"పిచికమీద బ్రహ్మాస్త్రం వేసేశా నని దివాన్జీ కులుకుతున్నాడు. కాని అతను చేసింది స్వామిద్రోహం"

"...............గుర్రాన్నిక్కడ వేశాను"

"ఆబంటుని కదిపి మీరు తోసిరాజనండీ"

"...............తోసిరాజురా"

"ఆటకట్టు" అని కూడా చెప్పండి"

"ఆటకట్టురా"

"............................."

"............................."

"ఏవూరు మహానుభావా మీదీ?"

"నన్ను చూస్తున్నారా? పొట్ట చేత్తో పుచ్చుకు వచ్చాను. అన్ని వూళ్ళూ నావే"

"మీ పేరు?"

"తంగిరాల శంకరప్ప"

"...............ఏమిరా, ఆట కట్టిందని వొప్పుకుంటూనా యెత్తు వేస్తావా?"

"...............చె—బ్తా.........ఈ గుర్రంతో యీబంటుని కొట్టేస్తే?"

"తెరచి రాజవుతుందండి"

".........ఈ రాజు నిక్కడ వేశాను"

"శకటు యింట్లో వేశారండి"

"ఇది యిక్కడ వేస్తే?.........ఇది కొట్టేస్తే?......పో—నీ .........ఆటకట్టింది. ఒప్పుకున్నానండీ"

"అయ్యా! మీరొక ఆట వెయ్యండి, చూద్దాం"

"చిత్రం..............."

"............................."

"ముందు మీరు కదుపుతారా నేను కదపనా?"

"మీరే కదపండి"

"చిత్రం..............."

"............................."

"అలా వచ్చారా? .........చి—త్రం............అయ్యా మిమ్మల్ని నాలుగో యెత్తు వెయ్యనివ్వను"

"చూద్దాం, కానివ్వండి"

ఎదటి వృద్ధు మూడో యెత్తు వేశాటప్పటికి గడియ పట్టింది. నాలుగో యెత్తు పడలేదు. ఆట కట్టింది.

అందరూ తెల్లబోయారు.

"అయ్యా, ఈపూట మీరు మాయింట్లో భోజనం చెయ్యాలి. మరి తప్పదు"

"ఈపూటకి మాయింటికి వస్తారు. రాత్రి మీయింటికి వస్తారు లేరా"

"మహానుభావా! మీ రుభయులూ నన్ను క్షమించాలి. మీ అనుగ్రహానికి చాలా సంతోషం. ఎన్నేసి పూటలు మీయిళ్ళల్లో భోజనం చెయ్యాలో, అప్పుడే అయిందా? ఇప్పటికి నన్ను విడిచి ... ... ...తగినాత మనవి చేసుకుంటాను"

"మీబస యెక్కడా?"

"పెద్దమ్మ యింట్లో"

".........భోజనం చెయ్యగానే రాగలరా?"

"మానెయ్య మంటే భోజనం కూడా మానెయ్యగలను"

"వద్దువద్దు. ఇంతట్లో మేము కూడా భోజనం చేసి వస్తాము. మిమ్మల్నొకచోటికి—అంటే వొక రాజుగారి యింటికి తీసుకువెడతాం. వారితో మీ రెత్తు వెయ్యగలిగితే—తరవాత మాట్లాడుకుందాం కాదూ?"

"తప్పకుండానూ"

ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు. "ఇదీ పద్ధతి" అంటూ, పెద్దమ్మ శంకరప్పటికి సుష్టుగా భోజనం పెట్టింది.

౪

"ఇదిగో, భీమసేనరావుపంతులుగారే? ఎప్పుడు దయచేశారు వూళ్ళోకి?"

"కాస్సేపు మాట్లాడకయ్యా శాస్త్రిలూ! పంతులుగారు నాఆట కట్టెయ్యాలని దీక్ష పట్టారు"

"ఎప్పుడు వేశారండి యెత్తు?"

"నేను నిన్న పొద్దున్న వేశాను"

"అ—లా—గా?.........అయ్యా! పంతులుగారూ! కోపం వచ్చినా సరే, ముందు మీరు నామాట చిత్తగించాలి........."

"ఒక్క క్షణం మీరు కూడా చూస్తూ వూరుకోగూడదూ?"

"అలా కాదు. ఒకమాటు ఆటకట్టినా, వొకమాటు కట్టించుకున్నా రాజుగారితో యెత్తు వెయ్యగలవా రీవూళ్ళో కల్లా మీరొక్కరే. కానీ—యిలా చూడండీ—ఈయన—తంగిరాల శంకరప్పగారు లెండి వీరి పేరు. ఒక్కమాటు వీరిని యెత్తు వెయ్యనివ్వండి. లేకపోతే వీరు చెప్పినట్టు మీరె వెయ్యండి"

"ఏవూరు వారిది?"

"చిత్రం. నా కేవూరూ లేదండి. చెట్టుమీది పక్షిని"

"పిట్టలు కూడా చదరంగం ఆడతాయా?"

"చిత్రం—చిత్రం! "ఆహార నిద్రాభయ మైథునాని—చి...చారూ? పిట్టలు మనుష్యులు చేసే పను లన్నీ చేస్తాయి; కాని ఈ ... వెయ్యడాని కింత పెపు వ్యర్థంగా గడిపెయ్యవండి"

"అలాగెం? ఏదీ, కాయ కదుపూ చూద్దాం......"

"నన్ను పరీక్ష చెయ్యాలంటే మీరు తప్పకుంటే రే... తుందీ?"

"ఏంచెయ్యమంటావూ?"

"అలా కూచుని రాజుగారికి సలహాలు చెప్పండి"

"మరి కానియ్య............."

".........రాజా నిలా తప్పించానండీ రాజుగారూ"

".........వేసి రాజా"

"..........తోసిరాజండి"

ఇలా అంటూ శంకరప్ప బంటుని గెంటాడు. అది రాజు వేసిన శకటు కొడ్డుతగిలి, పైగా, తోసిరాజుగా తయారయింది.

రాజు ఆశ్చర్యపడ్డాడు. భీమసేనరావుపంతులు తెల్లబోయాడు.

తరవాత, రాజు, బ్రాహ్మణయువకుల కోరగా మూడాట లాడాడు. చివరి ఆట ముగిశా టప్పటికి రాత్రి భోజనాల వేళ అయింది. కాని వొక్క ఆటేనా రాజు గెలవలేక పోయాడు. పైగా శంకరప్ప వెంట వెంటనే యెత్తు వేస్తూరాగా, రాజు గడియ—రెండేసి గడియలాలోచిస్తే గాని—భీమసేనరావు కూడా సలహా చెబితే గాని యెత్తు వెయ్యలేకపోయేవాడు.

శంకరప్పా, బ్రాహ్మణయువకులూ వెళ్లిపోయాక పంతులు, రాజుతో కూడా గుమ్మందాకా వెళ్లి "ఇదంతా ప్రతిభ అనే అంటారా మీరూ?" అని అడిగాడు.

"కాకేమీ?"

"ఎన్నటికీ కాదు"

"ఎంచేతా?"

"అలాగా......ఉచ్ఛిష్టగణపతి వుపాసన వుంది ఆ బ్రాహ్మడికి"

"మీ కెలా తెలిసెట్టారూ?"

"అంగాస్త్రం కట్టుకుని వున్నాడు చూశారా?"

"సింగివాదం కాదూ?...... మహారాజులుంగారి యెదట అంగం యెలా వుంటామో ఆలోచించారా?"

పంతులు, మెట్లు దిగి, "మరి సెలవు" అన్నాడు.

౫

ఆరాత్రి వూరు మాటు మణిగేదాకా—పెద్దమ్మ విముక్కుని వేళా అడి, బ్రాహ్మణయువకులు, ఎంతో కష్టంమీద వెళ్లిపోయి, సూర్యోదయం అయీ అవడంతోటే తయారయినారు.

నలుగురు యువకులూ, తరవాత శంకరప్పా బయలుదేరారు. అనేకవీధులు దాటారు. అనేకసందులు తిరిగారు. ప్రతీవీధిలోనూ, ప్రతీసందులోనూ అనేకచోట్ల, చాలామంది చదరంగమో, పేకాటో ఆడుతూనే వున్నారు.

ఒకచోట వొక బుగ్గమీసాలరాజు, వొక తురకతో కూచుని చదరంగం ఆడుతున్నాడు. ఒకచోట ఇద్దరు దేవాంగయువకులు చదరంగం కబుర్లు చెప్పుకుంటున్నారు. మరోచోట ముగ్గురు తెలగ పడుచులు తారీ ఆడుతున్నారు. కొన్నిచోట్ల కొందరు, లోపల ఆడే చదరంగం యెత్తులు వెయ్యడంలో వచ్చే తగవులూ, అరుపులూ వినపడుతున్నాయి.

చివరికి వెళ్లి వారొక బ్రాహ్మడి యింటో ప్రవేశించారు. అప్పటికే ఆ బ్రాహ్మడు—అరవైయేళ్ళు దాటినవాడు, ఒక క్షత్రియ యువకుడితో చదరంగం ఆడుతున్నాడు. ఆట చాలా బిగువుమీద వుంది. ఇద్దరూ ప్రాణాలు పందెం వేసుకుంటున్నట్టు ఆడుతున్నారు. ముసలివాడి ఆట కొంచెం లొంగుబాటులో వుంది. యువకులూ, శంకరప్పా చూస్తూ కూచున్నారు. వారిని వీరుగాని వీరిని వారుగాని పలకరించుకోలేదు

అరగడియ గడిచాక శంకరప్ప యికవోపికపట్టలేకపోయాడు. అతనేదో అనాలని నోరు విప్పబోతూ వుండగా వృద్ధబ్రాహ్మడు అతిచెక్కుతో వెనక్కి జేరబడి, "కృష్ణంరాజుగారూ! మీయిష్టం వచ్చిన వారిని సాయంపుచ్చుకోవచ్చు. ఈపూట మీరు నా ఆట కట్టగలిగితే—అసలు మీ రిప్పుడొక్క ఎత్తు వెయ్యగలిగితే నా గర్వపరిహారానికి మీ రేంశిక్ష వేసినా వొప్పుకుంటా" నంటూ మీసాలు దువ్వుకుంటూ చూస్తున్నాడు.

వచ్చిన నలుగురు బ్రాహ్మణయువకులూ మంచి ఆటగాళ్లే అనీ, (శంకరప్ప సంగతి యిదివర కెప్పుడూ చూడనేలేదు) అయినా వారు తన యెదట కూచోడానికే జంకుతారనీ యెరుగును. అంచేతనే ఆగర్వం అతనికి.

దీనిమీద కృష్ణంరాజుకి చాలా పౌరుషం వచ్చింది; కాని ముసలాడు నిజంగా అసాధ్యుడు. సరాసరి మహారాజులుంగారితో చదరంగం ఆడే గ్రామస్థులు నలుగు రైదుగురిలోనూ అతనొకడు. పోనీ, వచ్చిన వారి సాయం పుచ్చుకుందా మంటే వారు తనతోటి ఆడలేనివారు.

అతని కేమీ తోచలేదు; కాని ముసలాడి ఆట జన్మానికొక్కమాటేనా కట్టాలి. ఇవాళ తప్పకుండా కట్టాలి.

ఏమీ పాలుపోలేదు. అతని కళ్లు అప్రయత్నంగా శంకరప్పమీదకి తిరిగాయి. ఎందుకనుకుంటూనే "ఏవూరుమీది?" అని అడిగాడు.

శంకరప్ప జవాబు చెప్పలేదు.

అప్పుడొక యువకు డందుకుని "వారి వూరూ పేరూ అడగవద్దు. వారి సలహాపుచ్చుకోండి. వారు తాతగారిని మూడోయెత్తు వెయ్యనివ్వరు" అని చెప్పాడు.

అది విని ముసలాడు వెంకితనంగా చిరునవ్వు నవ్వాడు. రాజుకది మరింత పౌరుషం కలిగించింది.

యువకులు కూడా కొంచెం వుత్సాహపడ్డారు.

"ఏమండీ, దయచేసి నాకు సలహా చెబుతారా?"

"చిత్తం—చిత్తం......మనవి చేస్తాను. తమరు కదలక్కర్లేదు......అలాగే కూచోండి............"

శంకరప్ప దూరంగా వెళ్లి కూచున్నాడు. అక్కడికి తేరిపార చూసినా బల్ల కనపడదు.

యువకుల కిదేమీ అర్థం కాలేదు. ముసలాడు కూడా బింకంగానే వున్నాడు; గాని అతనిక్కూడా యిదేమీ బోధపడలేదు.

రాజు కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఏం, అలా దూరంగా వెళ్లిపోయారేం?

"దగ్గిర కూచుని ఆడ్డానికి తాతగారి యెత్తులో యేమంత చాతుర్యం వుందీ? నేనిక్కడే కూచుని చెబుతాను, మీరు యెత్తు వెయ్యండి"

యువకులు, ముసలాడి తెంకితనానికి సరి అయిన జవాబని సంతోషించారు. "ఇదేదో ఉద్దండపిడుగులా వుంది" అని, రాజా, కొంచెం దిటవు తెచ్చుకున్నాడు.

ముసలాడు శంకరప్పకేసి యుగ్రంగా చూశాడు.

"చూడండీ, రాజాగారూ! మీరాజాకి అగ్నేయంగావున్న మీగుర్రాన్ని వారిరాజు ముందు వెయ్యండీ"

"..........ముందు మనం రాజుని వెనక్కి తగ్గించాలండీ. లేకపోతే ఆట యింకా బిగిసిపోతుంది"

"ముందు గుర్రాన్ని అక్కడ వెయ్యండి చెబుతాను"

".........వేశాను"

"వారు యెత్తువేశాక చెప్పండి"

"...................."

"మనం గుర్రం తీసినచోట వారు తమ మంత్రిని వేశారు"

"సరే......చూడండీ, మీరాజాకి వెనక్కాల—వాయవ్యంగా వున్న శకటుని వారి మంత్రి కంటో పెట్టండి"

"పెట్టాను"

"తరవాత వారు తెం...శారో చెప్పండి"

"...................."

"వారు మంత్రితో మన గుర్రాన్ని కొట్టేశారు"

"బాగుంది. చూడండి. యీమాటు. తీసిన గుర్రం వెనక్కాల వున్న శకటుని వారి మంత్రిమీదకి—తెలిసిందా?"

"వేశాను"

"వారు తెం...శారో చెప్పండి"

"...................."

"...................."

"...................."

"వారిగారు తమ మంత్రిని మన శకటుమీదకి తెచ్చారు"

"ముందు వారికి తెరిచి రాజయింది. అది మామూలో లేనట్టుంది వారు"

ముసలాడు తెల్లపోయాడు. యువకులు "సెబాస్" అన్నారు. రాజా మీసంమీద చెయ్యి వేసుకున్నాడు.

ముసలాడు కంగారుపడ్డాడు. తప్పుకోడానికి అతని రాజాకి దారి లేదు. అడ్డు వెయ్యడానికి జంతువు—బంటుకూడా లేదు.

ముసలాడి ఆట కట్టింది. ఇంతే కాదు. నోరు కూడా కట్టింది.

కొంతసేపటికి పురెక్కి, ముసలాడు, శంకరప్పతో వోక ఆట వేశాడు. కాని యెత్తు వెయ్యలేకపోయాడు. చివరికి "కొట్టిరా" జనిపించుకుని "ఇక లేద్దాం. దేవతార్చనకి వేళ అయింది" అంటూ మాట వినిపించుకోకుండా యింట్లోకి చక్కాపోయాడు.

రాజా, శంకరప్పని పొగడుతూ యువకులతో గూడా తన యింటికి తీసుకువెళ్లి "మీరు నన్ను దిద్దాలి" అని కోరాడు.

౭

యువకులికి నిద్ర లేదు. ఆహారం లేదు. ఈప్రపంచధోరణే లేదు. వారికి, శంకరప్ప, ఉపాస్యదేవత అయిపోయాడు. అతణ్ణి పెద్దపెద్ద ఆటగాళ్ళదగ్గరికి తీసుకువెళ్ళడమే వారికి జీవితపరమార్గం అయిపోయింది.

ఒక్క వారం గడిచింది. పెద్దాపురంలో పేరుపడ్డ ఆటగాళ్లంతా శంకరప్పతో ఆడి చిత్తయిపోయారు.

ఇప్పుడు శంకరప్ప వీధిలోకి రావడం భయం. పడుచులు, ఇరవైలు, ముప్పయిలు, యాభైలు అతణ్ణి చుట్టుకుని—"ఒక్క ఆట వెయ్యండీ మేము చూస్తాము" "మాకు మెళుకువలు చెప్పండీ" "మీ కీ వూళ్లో వుండిపొండీ" "మీరు మాటు మహారాజాలుంగారితో ఆడాలండీ" "మేము దివాన్జీవారికి మిమ్మల్ని పరిచయం చేస్తాం రండీ" ఇలాగ కోరసాగారు,

"తంగిరాల శంకరప్ప" ఇది పట్నం అంతటా రామనామంలా అయిపోయింది.

చూడనివారు "ఎందర్ని వోడించివచ్చాడో! ఎన్నితోడాలు న్నారో! ఎన్ని సింహతలాటం మురుగులున్నాయో! ఎన్ని వుంగరాలు దొరికాయో! ఎన్ని శాలువులు కొట్టేశాడో!" అనుకొంటూ, చూసి. తమ కళ్ళని తామే నమ్మలేకుండా వున్నారు.

ఆవేషం బాగా లేదని అనేకులు పట్టంచుల చాపులివ్వవచ్చారు. ఉప్పాడ సన్న—జరీ—జామార్లివ్వబోయారు. తాపితాలు కొందరు సమర్పించబోయారు. కొందరు శాలువులు కప్పబోయారు; కాని, ఊహూ! శంకరప్ప వాటిని పుచ్చుకోలేదు. తాకలేదు. కన్నెత్తి చూడలేదు.

అనేకులు విందులకు పిలిచారు; కాని "ఇప్పుడు కాదు" ఇంతే శంకరప్ప సమాధానం.

"పెద్దమ్మకి చెల్లెలి కొడుకేమోరా" "మేనల్లుడేమోనండీ" "ఎంతాని కెవరో చుట్టం అయివుంటాడయ్యా" ఇలాగ ప్రతిపాదనలు జరిగాయి. కాని ఎవరూ నిశ్చయించలేక పోయారు.

*   *   *   *   *

మళ్ళీ వొకవారం గడిచింది.

సామంతులు, సేనాధిపతులు, వుద్యోగస్థులు, సంపన్నులు, ...సులు, కోరి తీసుకువెళ్లి. శంకరప్పతో చదరంగం ఆడి. ఆటకట్టించుకునికూడా సంతోషిస్తున్నారు.

తాణేదారుకి ఇదంతా వుప్పెనగా తోచింది.

దివాన్జీ చెవులు చిల్లులుపడ్డాయి; గాని అతనిదేమీ యెరగనట్లు ప్రవర్తించసాగాడు. అయితే "రాజాగారికే కబురుచేస్తే ...కొంపదీసి" అనే భయంమాత్రం కలక్కపోలే దతనికి.

*   *   *   *   *

మళ్ళీ యింకోవారం గడిచింది.

"తమ రాలాగే రావచ్చు. మహారాజులుంగారు తమకోసం యెదురుచూస్తున్నారు"

"జవానులు—రాణేదారులు—దివాన్జీలు—ఇంద రుంటూ వుండగా యీ వేషంతో దేవిడీలో అడుగుపెట్టనిస్తారా?"

"అందరూ తమకి అడుగులకి మడుగులొత్తుతారు"

వేషం చూసి గుర్రం బెంకితనం చూపించింది, కాని తేజస్సుకి ముగ్ధమయిపోయి శంకరప్ప యెడట పిల్లి అయిపోయింది.

*   *   *   *   *

ఇంద్రసభను తిరస్కరిస్తూ వున్న పెద్దాపుర రాజభవనంలో, దివాన్జీ దారి చూపుతూ వుండగా పుంభావసరస్వతిలాగ ప్రకాశిస్తూ వున్న గోచిపాతరాయుడు ప్రవేశించాడు. చతుష్షష్టిజగపతి మహారాజు సాదరంగా స్వాగతం యిచ్చి ఉచితాసనం చూపించాడు

ఉపోద్ఘాతం సక్రమంగా ముగిసిపోయింది

చదరంగంకోసం ప్రత్యేకించబడ్డ గదిలో మహారాజూ, శంకరప్పా యెత్తులు ప్రారంభించారు.

మహారాజా కిద్దరూ, శంకరప్ప కిద్దరూ వేశ్యలు వింజామరలు వీస్తూ, శంకరప్ప పోకడలు క్రీగన్నులతో పరకాయిస్తున్నారు.

జాము న్నర పైబడ్డింది. మహారాజు నింతసేపే ఆటలో ఏమీ కూచోపెట్టలేదు అందుకే మహారాజూ, అంతకంటే ముందు వేశ్యలూ ఆశ్చర్యపడుతూ వుండగా, శంకరప్ప చిరునవ్వుతో శకటుని నొక్కి వేశా

... గా, మహారాజు రాణి కి ఐ గతిసిరోధం కలిగించివుంది.

మహారాజు మనసు చెడిపోయింది అందుచేతకూడా అతని కెత్తుతోచలేదు

*   *   *   *   *

అది మొదలు.

ప్రతిరోజూ ప్రొద్దుటిపూట వొకగడియా, మధ్యాహ్నం వొకగడియా మహారాజూ, శంకరప్పా బల్లదగ్గిర కూర్చోడం ఎత్తుతో చక మహారాజూ, చేసేది లేక శంకరప్ప వెళ్ళిపోతూ వుండడం.

*   *   *   *   *

రోజులు గడిచాయి. వారాలు గడిచాయి మాసాలు కూడా ఆరు గడిచాయి.

మహారాజు నిద్రాహారాలు విడిచిపెట్టేశాడు పెద్దాపురం అంతా అట్టుడికిన ట్లుడికిపోతోంది

పదవి తక్కువ కానివాండ్లకు పైంది కూడా తక్కువ కాగా కాండారు అప్పుడే ప్రకృతిలో పడిపోయారు, కాని దివాన్జీ మూలిపోయాడు అతి సన్నిహించేది వైభవం కాదు అధికారమున్నూ కాదు, యమచెర అంటే చాలును చిత్రవధ అంటేకూడా హీనాతిహీనం అయిపోతుంది

*   *   *   *   *

ఏడోమాసం సగం గడిచింది మహారాజుకి. నిద్రాహారాలు మాని రాచకార్యాలు అశ్రద్ధచేసే స్థితికూడా వచ్చింది

తాను, ఇంతటి ఆటగాణ్ణి అగౌరవపరిచి, కొంచెం—పల్చపల్చగా మందలింపులు తినివుండడం వల్ల ఈసందర్భంలో యేం చెబితే యేం మనసుకుంతో అని చెప్పలేక, చెప్పకుండా వుండలేక తుక్కుతుక్కయిపోతున్నాడు దివాన్జీ

*   *   *   *   *

అప్పుడే సూర్యోదయం అయింది. దేవిడీలో నగారా ఝూంఝూని మోగిపోతోంది. పాలలు శాగుచెయ్యడానికి బయట కట్టివెయ్యబడివున్న మదపుటేనుగులు ఘీంకారాలతోటీ, పారశీకాశ్వాలు సకిలింపులతోటీ అన్నదాతలను ఆహ్వానిస్తున్నాయి

కోటలో చలిచీమలకు దగ్గర్నుంచీ ప్రబోధం కలిగింది.

సాముగరిడీలు చాలించి, మహారాజు అప్పుడే స్నానపుగదిలో ప్రవేశించాడు ఇద్దరు సుబెతలు నూనెజిడ్డు వదలడానికి సుగంధచూర్ణంతో నలుగుపెట్టారు ఒకతె కుంకుడుకాయల పులుసు పిసుకుతోంది మరొకతె నీళ్లు తోడుకుంటోంది ఇంకొకతె మధ్యమధ్య చెయ్యిపెట్టి నీళ్లపాళాలు చూస్తోంది వేరొకతె సువర్ణకలశం పట్టుకుని గంగాళం దగ్గిర నుంచుని వుంది.

సరిగా యీ సమయంలో మహారాజా, గుమ్మంలోవున్న యువతిని మాని "ఒల్లా జగ్గప్పని తీసుకురా" అని కొంచెం చురుగ్గా చెప్పాడు.

కారణం తెలవక పరిచారిక లింకా కంగారుపడుతూనే వుండగా జగ్గప్ప వచ్చి "చిత్తం మహాప్రభూ!" అంటూ చేతులు జోడించుకు నుంచుని "నుంచున్నపాళంగా శంకరప్పగారిని తీసుకురారా" అని మహారాజు చెప్పగా మళ్లీ "చిత్తం మహాప్రభూ" అంటూ వంగి దండాలు పెట్టి, గుర్రం యెక్కి అలంకరించబడ్డ మరో గుర్రాన్ని వెంటబెట్టుకుని వుడాయించాడు.

*   *   *   *   *

అప్పుడే స్నానసంధ్యాదులు ముగించుకుని ఆరవేసిన వస్త్రం కట్టుకుని యువకులతో మాట్లాడుతూ వున్నాడు శంకరప్ప.

"దండాలు బాబయ్యా!"

"శ్రీకృష్ణార్పణం..... ఏమిటోయ్ కబుర్లూ?"

"ఉంచున్న పాళంగా తీసుకురమ్మని సెలవయింది బాబయా"

శంకరప్పకి చిరునవ్వు వచ్చింది దాంతో అతను వపక్కకి తిప్పుకుని, కిందికి చూస్తూ వొక్కమాటు శిరఃకంపం చేసి, "శంకరప్పగారు గుర్రం యెక్కి వెళ్లరుట, ఏనుగెక్కి తారట" అని మనవిచెయ్యి మహారాజులుంగారితోటి" అంటూ యెగరవేస్తూ చెప్పాడు.

జగ్గప్పకు, అక్కడవున్న మహారాజు ఆజ్ఞకీ అర్థం తెలవలేదు. డు శంకరప్ప జవాబుకీ అర్థం తెలవలేదు పైగా అతనికి మహారాజుతో పాటు శంకరప్ప కూడా తిరస్కరించడానికి వీల్లేనివాడు వున్నాడు.

జగ్గప్ప, శంకరప్పకోసం తెచ్చిన గుర్రాన్ని అక్కడ వుంచి గుర్రం యెక్కాడు. అంతే.

౭

ఉచితవేషంతో మహారాజు సభాభవనంలో పచారు చేస్తున్నాడు. ఈ వేపునా ఆ వేపునా నిలిచివున్న వేశ్యలు, ఎవరి దగ్గిరికి వచ్చినప్పుడు వారు, మహారాజుకి వింజామరలు వీస్తున్నారు.

దివాన్జీ వొకపక్కగా నిలిచి భవిష్యత్తు తెలవక కండామీదా పడుతున్నాడు. శంకరప్ప వస్తే గుర్రాన్ని పట్టుకోడానికి జగ్గప్ప, బైట సిద్ధంగా వున్నాడు. తానేదారు, "ఇటు ఇటు దేవా" అంటూ దారి చూపించడానికి శంకరప్పకోసం మెట్లదగ్గిర నుంచుని వున్నాడు.

నిముషం వొక మహాయుగంలా వుంది.

* * * * *

శంకరప్ప గుమ్మంలో అడుగుపెట్టాటప్పటికి మహారాజు అమాంతంగా వెళ్లి కౌగిలించుకున్నాడు.

కళ్లు తెరిచి చూశాటప్పటికి ఇద్దరూ, ఆ కౌగిలింతలోనే, సింహాసనం మీదకూచుని వున్నారు.

మహారాజుకీ శంకరప్పకీ కూడా ప్రయత్నపూర్వకంగా కంఠాలు సవరించుకోవలసివచ్చింది.

"శంకరప్పగారూ"

"ఏం సెలవు జగత్ప్రభూ!"

"తమరు మా ఆట కట్టేశారండీ"

"నా మీద కలిగిన అనుగ్రహంవల్ల తమరలా సెల విస్తున్నారు మహాప్రభూ! ఏలినవారికి నా బాల్యచాపల్యం చూపించడానికి వచ్చానే గాని ఆట కట్టడానికి నే నెంతటివాణ్ణి మహారాజా?"

"అలా కాదండీ. మేము వోడిపోయాము. ఈ విషయం అనందం—గర్వంతో మేము మనవి చేసుకుంటున్నాము"

"..............................."

"చదరంగంలో, మిమ్మల్ని గెలవగలవాడు నభూతో నభవిష్యతి. తమచేతిలో అపజయం పొందినందుకు కూడా మేము గర్వపడుతున్నాము"

"ఏలినవారి సౌజన్యానికి ఏలినవారి మాటలు గుర్తుగా వున్నాయి. పట్టుపట్టి ఇలాంటి జగత్ప్రభువుతో చదరంగం ఆడ— సిగ్గుపడుతున్నాను, నన్ను క్షమించవలసిందని నా ప్రార్థన మహాప్రభూ!"

"ఇలాంటి ఆనందం మాకిదివరలో కలగలేదు. ఇక ముందున్నా కలగబోదు. ఇందుకు గురుతుగా తమర్ని మేము సత్కరించవలసి పెద్దాపురిసంస్థానంలో వున్న యేదేనా సరే తమకి దాఖలు చేస్తాము, సెల విప్పించండి"

"నాకు బహుమానమా జగత్ప్రభూ! ఎత్తువెయ్యగలవాడు దొరికి చదరంగం ఆడడానికి మొగంవాచిపోయి వచ్చాను. దేవేంద్రుని అధఃకరించే ఏలినవారితో ఆడాను. తృప్తి అయింది. నా కోరిక సఫలం అయింది. నాకింకేమీ బహుమతీలు అక్కరలేదు జగత్ప్రభూ!"

"తమరు విద్యను విక్రయిస్తున్నారని కాదు మేము మనవి చేసేది. తమరు కళాకుశలురు. కళలను గౌరవించడం రాజుల ధర్మం. బీదతనం తమ ప్రజ్ఞ కేమీ అడ్డురాలేదు. ఇప్పుడు మేము చేసే బహుమానంవల్లనే తమరు సంతోషిస్తారనీ కాదు. విద్యార్థులకు కళలమీద ప్రీతి కలగా లంటే, ప్రభువులు, కళాకుశలురను సత్కరించడం చాలా అవసరం. ఇప్పుడేనా మా అభిప్రాయం—"

"జగత్ప్రభువులతో వాదించడం అనుచితం. సిద్ధపడినా నేనందుకు సమర్థుణ్ణి కాను"

"తమ అభీష్టం—"

"నేను నిరుపేదను. నిరుపేదలకు కూడు, గుడ్డ—ఇంతకంటే మరేమీ అక్కర్లేదు. వీటిలో తాము ఒక్క అన్నం పెడితే చాలు నాకు."

"తమ కోరిక సెలవివ్వండి"

"నాకు కావలసింది అన్నం, నాయిష్టక్రీడ చదరంగం"

"చిత్తం"

"చదరంగానికి అరవైనాలుగు గదులు. మొదటిగదిలో వొక వడ్లగింజ, రెండోగదిలో దానికి రెట్టింపు, మూడోగదిలో దానికి రెట్టింపు. అనగా నాలుగు గింజలు. ఇలాగ గదులు వెళ్లిన కొద్దీ రెట్టింపుచేస్తూ వడ్లగింజలు దయచేస్తే నాకంతే చాలు మహాప్రభూ"

"చిత్తం. మనం మళ్లీ మధ్యాహ్నం కలుసుకుందాం"

"చిత్తం జగత్ప్రభూ"

ఇద్దరూ సింహాసనం దిగారు. "లెక్క కట్టించండి" అని దివాన్జీతో చెప్పి మహారాజు వాసగృహానికి వెళ్లిపోయాడు. "మహానుభావా! దయచెయ్యండి" అంటూ తానేదారు, శంకరప్పని గుర్రందగ్గిరకు తీసుకు వెళ్లాడు.

౮

ఇక జాముపొద్దుంది.

సభాభవనం అంతా కిక్కిరిసిపోయివుంది.

ఉప్పాడ జరీబట్టలతోటీ, కాశ్మీరదేశపు సాల్వాలువులతోటీ, సింహతలాటపు మురుగులతోటీ, మకరకుండలాలతోటీ, బంగారపు గొలుసులతోటీ, రవ్వల ఉంగరంతోటీ అలంకరించబడివున్న శంకరప్పని చెయ్యిపట్టుకు తీసుకువచ్చి, మహారాజు, సింహాసనం అలంకరించాడు. వెంటనే సభ్యులంతా జయధ్వనులు చేశారు.

అప్పుడు దివాన్జీ, మహారాజు ఇంగితం కనిపెట్టి "వడ్లగింజలు లెక్కకట్టాను మహాప్రభూ! వారు కోరిన కోర్కె తీర్చాలంటే పెద్దాపురిరాజ్యం చాలదు జగత్ప్రభూ!" అని చెప్పాడు. అది విని శంకరప్ప చిరునవ్వుతో మొగం వంచుకున్నాడు. మహారాజు నిర్విణ్ణుడైపోయాడు.

దివాన్జీ లెక్కకట్టిన కాగితం మహారాజు యెదట వుంచాడు. అది చూసి మహారాజు "శంకరప్పగారూ! ఈవిషయంలో కూడా మేము వోడిపోయాము" అన్నాడు.

అదివరకే వుజ్జాయింపుగా లెక్కకట్టి యీ విషయంలో కూడా శంకరప్ప చూపించిన చాతుర్యానికి చాలా ఆశ్చర్యపడుతూ వున్న సభ్యులు కొందరు మహారాజా నిరాడంబరతినీ, సత్యనిరతినీ చాలా శ్లాఘించారు.

కొంచెంసేపు తీవ్రాలోచన చేసి, మహారాజా "శంకరప్పగారూ! ఇంతవరకూ వచ్చినవాయిదాలలో యెవరూ మాట తప్పియెరుగరు. మేము పెద్దాపురరాజ్యం అంతా తమకి దాఖలు చేసుకుంటున్నాము" అన్నారు. ఇది విని సభ్యులలో చాలామంది చాలాకటకటపడ్డారు. దివాన్జీకూడా చాలా విచారించాడు. అప్పుడు ఇదంతా గ్రహిస్తూనే వున్న శంకరప్ప "జగత్ప్రభూ! ఏలినవారు ఇందాకా సెలవిచ్చింది వొకటి, యిప్పుడు సెలవిస్తూవున్నది వొకటీనీ" అన్నాడు.

"ఎలాగా?"

"ఏలినవారు "పెద్దాపురరాజ్యంలో వున్న దేది కావలసినా నాకు దయచేయిస్తా" మన్నారు; గాని పెద్దాపురరాజ్యమే దఖలు పరుస్తా మని సెలవివ్వలేదు"

"..........................."

"కనక జగత్ప్రభువులవారు ఒక బ్రాహ్మడు నిర్విచారంగా జీవించడానికి తగినంత వృత్తి దయచేయిస్తే అదే నాకు మహా మేరువు"

శంకరప్ప మాటలు విని సభవారందరూ చాలా హర్షించారు. దివాన్జీ మొగంమీద మొదట సంతోషమూ తరవాత మళ్లీ సిగ్గూ అంకిత మయినాయి. తరవాత, కొంతసేపు ప్రశంసలూ, కొంతసేపు వినోదాలూ, కొంతసేపు ఆలోచనలూ జరిగాయి.

మరికొంతసేపు నృత్యవినోదాలున్నూ జరిగాయి.

చివరికి మహారాజా, "శంకరప్పగారూ! తమకు మేము సర్వలక్షణసంపన్నమైన వొక అగ్రహారం సమర్పించుకుంటాము. తాము కోరినచోట, కోరిన గ్రామం స్వాధీనపరుస్తాము. అంనోరి కాదిపరివార మంతా యేర్పాటు చేస్తాము. తాము పెద్దాపురంలోనే వుండి యెప్పుడూ మాకు చదరంగవినోదం కలిగిస్తూ వుండవలసిం"దని కోరుతూ సభ చాలించారు.

(ఈకథ జరిగిందే అని వినికిడి. కాని కల్పనా, రచనా మట్టుకు నావి. సుబ్రహ్మణ్యశాస్త్రి.)

---

# మన తెలుగు వార్తాపత్రికలలో వాడే భాష

మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, కవితాసమితి

వార్తాపత్రికలు ఎందుకు పుట్టినవి? తెలియని సంగతులు తెలిపి ప్రజలకు జ్ఞానము కలిగించుటకు కదా? అయితే, ఇప్పుడు మన వార్తాపత్రికల వల్ల ఆ పని సరిగా జరుగుతూ ఉన్నదా? ఏదో కొంత జరుగుచున్నప్పటికీ, సరిగా జరుగుతూ ఉన్నది—అని చెప్పడానికి వీలు లేదు. ఎందుచేత? పత్రికలలో వాడే భాష ప్రజలకు బాగా బోధపడితే కదా అందులో ఉన్న సంగతులు వారికి తెలియడానికి? అందువల్ల వారికి జ్ఞానము కలగడానికి? విందుకు పిల్చినవారు తినే పదార్థాలు ముందు పెట్టితే ఎవరైనా తింటారు; అరిగించుకుంటారు; అందువల్ల వారికి సత్తువ వస్తుంది. అంతేగాని విలువ గలవని చెప్పి, వెండి ముక్కలూ బంగారపుముక్కలూ రత్నాలూ వాటితో కలిపి తెచ్చి పెట్టితే ఎవరైనా నోట పెట్ట గలరా? ఆనపడి నోట బెట్టినా అవి కొఱుక బడుతవా? అందువల్ల కడుపు నిండుతుందా? సత్తువ వస్తుందా? ఏదీ లేదు. అందువల్ల వీలైన పదార్థాలు కూడాతినడానికి వీలు లేక విందుకు ఒక నమస్కారము చేయవలసివస్తుంది. కొంచెమెచ్చు తక్కువగ మన వార్తాపత్రికలలో వాడే భాష స్థితి ఆలాగే ఉన్నదనక తప్పదు.

పత్రికాధిపతులు- అనగా- పత్రికలలో ముఖ్య విషయములను గూర్చి ఎప్పుడూ వ్రాస్తూ ఉండేవారు- తాము స్వయముగా వ్రాసే భాష చదువుకొన్న వారికే ఒక్కొక్కప్పుడు ఇనుప గుగ్గిళ్ల లాగున ఉంటుందని చెప్పవలసి వచ్చేటప్పుడు తక్కినవారిమాట చెప్ప నవసరమే లేదు. పండితుల కొఱకే తాము వ్రాయడము లేదన్న సంగతి స్పష్టముగా తెలిసినప్పటికీ వారు ఆలాగు వ్రాయడానికి ఏదో కారణము ఉండాలె. ఒకటే కాదు; కారణాలు చాలా ఉన్నవి. తమ పాండిత్యము చూపెట్టవలెననే కోరిక ఒకటి; తమరిని పండితులు కారనుకుంటారేమో అనే భయము ఒకటి; తాము వ్రాసేది పైకి [illegible]రముగా కనపడవలెననే తలంపు ఒకటి; తరువాతి [illegible]ధికములో వ్రాసే అభ్యాస బలము ఒకటి; వ్రాసే [illegible]యములను గూర్చి బాగా ఆలోచించని లోపము ఒక[illegible]; తమ అభిప్రాయములు మఱుగుగా ఉండవలెననే [illegible]

ల్పము ఒకటి. ఇంగ్లీషు ముక్కలు ఎక్కడా వాడుకలో లేని పదములలోనికి మార్చడము ఒకటి. ఇవి అన్నీ న్నీ కలిస్తే భాష బాగానో చాల పలికో కొంత లికో బిత్తెక్కుతుంది. ప్రజలు వాడుకోని ముక్కలు మూలమూలలనుండి బయలు దేఱుతవి; విడిముక్కలే వు; చిన్న సమాసాలూ, పెద్ద సమాసాలూ, తర్జుమా సమాసాలూ పత్రికలలోని కెక్కుతవి; పేజీలు నింపుతవి. న్ని అక్షర జ్ఞానము మాత్రము కలిగి చదువుకొనేవా రి త్రాళ్లు; వినేవారికి ఉఱుములు; వాడుకలో లేని లుగు ముక్కలకూ సంస్కృతపు ముక్కలకూ తోడు ్లీషు ముక్కలు కూడా అక్కడక్కడ దొర్లుతూ టవి. ఇంతే కాదు. తెలుగు కాని తెలుగు మాటలు కూడా కొన్ని అవతరిస్తవి. ఇదంతా తెలుగు భాషే. ఱ వ్రాయుగలవారమనుకొనేవారు అంటఱూ అందుకు ృప్తిచెంది సంతోషిస్తూకూడాఉన్నారేమో! ఏమో క్కఱలేదు. అలా కాకపోతే తాము వ్రాసేమోస్తరు మాన్పుకోరా? వాడుక భాషలో వ్రాయరా? ఆలాగు కోలేదు; ప్రజల భాషలో వ్రాయడములేదు. , తమ వ్రాతలు గొప్పగా చూచుకొని ఎప్పుడూ రూ, అప్పుడప్పుడు వ్రాసేవారిలో చాలామంది —వాడుకభాషలో వ్రాసేవారు కొందఱున్నారు ండఱూ అని చెప్పవలసిన దురవస్థ దైవానుగ వల్ల తప్పినది—సంతోషిస్తూ ఉన్నారనే అనుకోవ టుంది. ఎవరు వ్రాసినది చూచుకొని వారు సం ంచరాదా? తప్పా? అనవచ్చును. తాము సంతో షముతోనే ఊరకుంటే ఎవరు తప్పగలరు? ఏమీ అనఁజాలరు? సంతోషింపనూ వచ్చును; తప్పూ కాదు. కాని, ప్రజలకోసమని ప్రచురించే లలో అది ఎక్కవలసిన అవసరము మాత్రము నొక్కి చెప్పక తప్పదు. ఎందు కెక్కకూడదు? ఎవరైనా తొందరపడి అడుగవచ్చును. ఈ ప్రశ్న వారు పై వారిని అడగడానికి బదులు తమరిని తామే సుకొంటే బాగా ఉంటుంది. అందు కొఱకే ఈ సం ఎత్తుకొని నాలుగు ముక్కలు వ్రాయవలసివచ్చినది.

పత్రికలు పెట్టి వాటిలో తమకు అవసరములని తోఁచిన విషయములను గుఱించి వ్రాసేవారూ, పైనుండి వ్రాసే వారూ,—"మేము ప్రజల మేలుకోసము వ్రాసేటప్పుడు పత్రికలలో మేము వ్రాసిన వ్రాత ఎక్కకూడదనడము తెలివి తక్కువ మాట కాదా?" అని కోపగించుకొని మరల అడుగు తారేమో! అయ్యలారా! తొందరపడ కండి; కోపపడకండి. మీరు మంచి ఉద్దేశముతోనే వ్రా స్తూఉన్నారు. ఎంతో కష్టపడుతూ ఉన్నారు. అంతే కాదు; కొందఱు నష్టాలపాలుకూడా అవుతూ ఉన్నారు. అయితే మీరు పడే కష్టానికీ, మీరు పొందే నష్టానికీ తగినంత ఫలము కలుగుతూ ఉన్నదా? లేదనే నా నమ్మ కము. మీ పత్రికలవల్ల తగినంత ఫలమే కలుగుతూ ఉంటే అవి అన్నీ కాకున్నా కొన్ని అయినా చదివి కొంచెమో గొప్పో సంతోషిస్తూ మేలు పొందుతూ ఎక్కడో మూల కూర్చుండే నాకు దీనిని గూర్చి కదప వలసిన అవసరమే లేకపోవును. అయితే "తగినంత ఫల మనగా ఏమిటి? అని మరల ప్రశ్న రావచ్చును. మఱేమిటి? "ప్రజలు సంతోషించడము; వారికి జ్ఞానము కలగడము; అందు వల్ల సుఖము పొందడము." మీరు కోరే ఫలము మాత్రము ఇది కాదా? అవును, ముమ్మా టికీ అవును. కాని, ఇప్పుడు మీ పత్రికల వల్ల కలుగవ లసినంత సంతోషము గాని, జ్ఞానము లాభముగాని ప్రజకు కలుగుతూ ఉన్నదా? ఇదే ముఖ్యమైన ప్రశ్న. ఉన్న చిక్కంతా ఇక్కడే వచ్చినది. 'లేదు' అనే విచా రిస్తూ అయినప్పటికీ పై వారు చెప్పక తప్పదు. మీరు ఒప్పుకోక తప్పదు. నిజముగా మీ పత్రికల వల్ల కలుగ వలసినంత సంతోషమూ— జ్ఞానమూ— లాభమూ కలు గుతూ ఉంటే ఎక్కువ మంది ఆత్రుతతో పడి అవి ఎందుకు తెప్పించుకోరు? మీ చందాదారులసంఖ్య ఎందుకు తక్కు వగా ఉంటుంది? మీలో కొందఱికి అప్పైనవుతూ ఉన్నా కొందఱికి ఎందుకు నష్టమువస్తూఉన్నది? చెప్పండీ, ఏమి సమాధానము చెప్పతారో చూస్తాను.

"మనవాళ్లు బీదవాళ్లు" అని చెప్పతారా ఏమిటి? ఆ సంగతి నాకూ తెలుసును. కొంచెము తెలియడమే

కాదు. బాగా తెలుసును. సంతోషము కలుగుతుం దనుకొంటేను—లాభము కలుగుతుం దనుకొంటేను—ఏ బీదతనమూ అడ్డు రాదు. కల్లు — సారా—గంజాయి మొదలైన నిషావస్తువుల మీఁద గవర్నమెంటువారికి కోట్లకొలది వచ్చేటట్టుగా ఖర్చు పెట్టే మహాత్ములు ఎవరు? రానురాను హెచ్చుచేస్తూ ఉన్నప్పటికీ పుస్తో—పూసో—చెంబో—ముంతో—ఇల్లో—వాకిలో—భూమో—పుట్టో—అమ్మి ఒకప్పుడు జుల్మానాలతో కూడా బడి జీతాలు కట్టుతూ ఉన్న తెగువరలు ఎవరు? బీదవాళ్లయిన మనవాళ్లే. ఇష్టమైనదానికి డబ్బు ఎక్కడనుంచి అయినా వస్తుంది—కాఁబట్టి, ఈ సమాధానము సరి అయినది కాదు.

పోనియ్యండి. బీదతనము చేతనే మనవాళ్లు చాలమంది పత్రికలు తెప్పించుకోవడము లేదనుకొందాము. అయితే అందఱూ బీదవాళ్లు కారే, కొందరైనా తెప్పించుకోఁగల వీలున్నవారు ఉన్నారే. అట్టి వారైనా ఆత్రుతపడి తెప్పించుకొంటున్నారా? సంతోషించడానికి వీలున్నదా? అదీ లేదు. ఏ కారణముచేతనైతేనేమి తెప్పించుకోని వారి మాట మన కెందుకంటారా? సరే; వారిని వదలి వేతాము. స్వయముగా తెప్పించుకొనేవి కాని పైవారు తెప్పించేవి కాని చదువుకొనేవారైనా అందఱూ సంతోషిస్తూ ఉన్నారా? వారికి జ్ఞానము కలుగుతూ ఉన్నదా? లాభము కలుగుతూ ఉన్నదా? కొందఱు కొంతవఱకు సంతోషిస్తూ ఉన్నారనీ, కొందఱికి కొంతవఱకు జ్ఞానమూ లాభమూ కలుగుతూఉన్నదని చెప్పడానికి వీలున్నదిగాని చాలామందికి కలుగవలసినంత సంతోషమూ—జ్ఞానమూ—లాభమూ కలుగుతూ ఉన్నదని అనడానికి అవకాశము లేదు.

కాఁబట్టి వార్తాపత్రికలు ఎందుకు పుట్టినవో గుర్తించుకొని, దానికి తగిన భాషే—తెనుఁగుతనమునకు ఎట్టిలోటూ కలుగకుండా—వ్రాస్తే, ఎంతో బాగా ఉంటుందనీ, అందువల్ల తెనుఁగువారికి—తెనుగునాటికీ ఎంతో మేలుకలుగుతుందనీ, తెనుఁగువార్తాపత్రికలలో వ్రాసే వారి కందరికీ మనవిచేస్తున్నాను.

---

# ఆంధ్రవాచస్పత్యము

మా మిత్రులూ, ఉభయభాషా— సాహిత్యవిద్యాప్రవీణులూ అయిన శ్రీబులుసు వేంకటరమణయ్యగారి యీరచన కుపోద్ఘాతరూపంగా వొక విచిత్రకథ చెప్పవలసివుంది.

శ్రీకొట్ర శ్యామలకామశాస్త్రిగారి ఆంధ్రవాచస్పత్యం నేను మొదట్నుంచీ చూస్తూనే వున్నాను.

మా మిత్రులు శ్రీగన్నవరపు సుబ్బరామయ్య పంతులుగారూ, విద్వాన్ శ్రీ టి. అర్మ్‌గంపిళ్లెగారూ కలిసి దానిమీద విమర్శ రాసి పంపారు. అది యీపత్రికలోనే జూన్‌సంచికలో ప్రకటించబడ్డది.

జూన్ సంచిక ప్రకటించి వొకపనిమీద వెళ్లి మద్రాసులో వుండగా, శ్రీకాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు ఆవిమర్శకు జవాబు రాస్తున్నారని తెలిసింది.

తరవాత శ్యామలకామశాస్త్రిగారు మా ఆఫీసుకి వచ్చి ముందు ప్రబుద్ధాంధ్రకు చందాదారుగా చేరి, "నా ఆంధ్రవాచస్పత్యంమీద మీరు ప్రకటించిన విమర్శకు ప్రతివిమర్శ తయారవుతోం"దనీ, "ఇంటికి వెళ్లగానే పంపుతా"ననీ, "అది సూటయాభై పేజీలవుతుం"దనీ, "నెలకు నాలుగుపేజీలు మీఖర్చులమీదా, మరో నాలుగు పేజీలు మాఖర్చులమీదా ప్రకటిస్తూ దాన్ని పూర్తిచెయ్యవలసిం"దనీ మా మానేజరుతో చెప్పి వెళ్లిపోయారు. ఇది జరిగిన కొద్ది కాలకు మాపట్నంలోనే వకీలుగా వున్న శ్రీరావూరి చిట్టి సుబ్రహ్మణ్యంగారు ఆవ్యాసం రెండుభాగాలు తెచ్చి మా మానేజరు కిచ్చారు. తరవాత రెండురోజులకు మద్రాసునుంచి నేనింటికి వచ్చి జరిగిందంతా విని, వ్యాసంలో ఒకటిరెండు పేజీలు చదవగా అది బ్రహ్మయ్యశాస్త్రిగారు రాసిందే అని స్థిరపడింది; కాని వ్యాసకర్తగా సూరెల రామచంద్రశాస్త్రిగారి పేరు దానిమీద రాయబడి వుంది.

నేనింటికి వచ్చిన రెండురోజులకు చిట్టిసుబ్రహ్మణ్యం గారు వ్యాసంయొక్క మూడో భాగం తెచ్చి యిచ్చి, అప్పుడు, "నేను, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు రాశారని మద్రాసులో తెలిసిం"దనీ, "జవాబు రాయవలసినవారు శ్యామలకామశాస్త్రిగారు కాని మరొకరు కా"రనీ, "పైగా, బ్రహ్మయ్యశాస్త్రి రచన సూరెల రామచంద్రశాస్త్రిగారి పేరితో రావడం అన్యాయ"మనీ, "మధ్యవర్తి జవాబు రాస్తే విమర్శకుల లోపాలతో గ్రంథకర్త లోపాలుకూడా చూపించాలి; గాని ఎలాగేనా ...

కర్తను సమర్థించడానికే ప్రయత్నిస్తూ పాక్షికంగా ప్రవర్తించడం తప్పనీ, చెబుతూ యిది "అలావుందా లేదా?" అని అడిగాను. దీనికి సుబ్రహ్మణ్యంగారు "రామచంద్రశాస్త్రిగారు గ్రంథకర్త గారిని సమర్థించడానికే ప్రయత్నించా" రని చెబుతూ "ప్రకటిస్తారా లేదా?" అని అడిగారు. అందుకు నేను "ఈస్థితిలో రామచంద్రశాస్త్రిగారి జవాబు ప్రకటించవలసిన బాధ్యత నాకు లే" దనీ "ఇంతే కాకుండా, జవాబుకి రెండుమూడు పేజీలకంటే యెక్కువ స్థలం అవసరం లే" దనీ "కాకపోతే, విమర్శ ఆరున్నర పేజీ లుంది కనక జవాబుకి కూడా ఆమాత్రం స్థలం యివ్వగల" ననీ, "అంతేగాని, నూటయాభై పేజీల జవాబు నేనే సందర్భంలోనూ కూడా ప్రకటించ" నని చెప్పాను.

ఇందు కంగీకరించక, చిట్టిసుబ్రహ్మణ్యంగారు, ఆమూడుభాగాలూ పుచ్చుకుని వెళ్లిపోయారు.

తరవాత ఆవ్యాసం "ప్రాథమికవిద్య" అనే పత్రికలో పడ్డది. ౪౨ పేజీలలో ముగిసేటట్టుది కుదించబడింది. అయితే: వ్యాసకర్త పేరు "నూకల రామచంద్రశాస్త్రిగారు" అని కాక, "నూకల సూర్యనారాయణశాస్త్రిగారు" అని మార్చబడ్డది.

ఆంధ్రవాచస్పత్యం నిఘంటువు కాని, వొకమాటు చదివి బీరువా అడుగున పడేసి వుంచవలసిన నవల కాదు. అది చాలా పెద్దది కాని, కొద్దిపాటిది కూడా కాదు. కాగా, దానివల్ల భాషకు, అపకారమైనా హెచ్చుగానే వుంటుంది, ఉపకారమైనా హెచ్చుగానే వుంటుంది. అలాంటి పుస్తకాలమీద విమర్శలు తప్పకుండా వస్తాయి. గ్రంథంలో సారం వుంటే తత్కర్త లేమీ తికమకలు పడనక్కరలేదు. సారమే లేకపోతే విమర్శల కెలాంటివారిచేత జవాబులు రాయించినా ప్రయోజనం కలగదు. అసలు, ఇతర్ల సాయం, విమర్శకు జవాబు రాయడంలో కాక, గ్రంథరచనలోనే పొందివుంటే శ్యామలకామశాస్త్రిగారు భాషకు మహోపకారం చేసినవారై వుందురు.

ఇంతకీ: అంత పెద్ద గ్రంథానికి కర్త లనిపించుకుంటూ వున్న శ్యామలకామశాస్త్రిగారు, జవాబు మరొకరిచేత రాయించి, దాని కర్తృత్వం మొదట వొకరికీ, తరవాత మరొకరికీ దఖలుపరచడంలో ఏమి ఔచిత్యం వుందో వారే సెలవివ్వాలి.

సుబ్రహ్మణ్యశాస్త్రి

[illegible] జూనునెల 'ప్రబుద్ధాంధ్ర' పత్రికలో ప్రకటింపఁబడిన 'ఆంధ్రభాషావాచస్పత్య' విమర్శనమును ప్రతిఘటించుచు, శ్రీ నూకల సూర్యనారాయణశాస్త్రిగారు జూలైనెల 'ప్రాథమికవిద్య' లో నొకవ్యాసమును ప్రకటించిరి. అందు వారొకచోట నన్నుగూర్చి '... శ్రీ భారతిలో బ్రహ్మశ్రీ బులుసు వెంకటరమణయ్యగారను పండితులు వాచస్పత్యముయొక్క మచ్చుపొరటంగని వానిని బహుళముగఁ గొనియాడి యుండిరి.' అని వ్రాయుటచే నేను ఆనిఘంటువునుగూర్చి ఇపుడు కొంచెము వ్రాయవలసి వచ్చినది.

విమర్శనార్థము 'భారతి'కి బంపఁబడిన 'శ్రీ ఉభయభాషావాచస్పత్యము' [అప్పటికి నిఘంటువుపేరు అట్లేయున్నది.] యొక్క 'మచ్చుపదముల పొత్తము'ను తత్సంపాదకుల కోరికపయి నేనువ్రాసిన విమర్శనము ౧౯౩౪ సం. మేనెల భారతిలో ప్రకటింపఁబడినది. కాని యందు నేను పైనిఘంటువును ఏమియు పొగడలేదు. నేను ప్రశంసించినంతమాత్రమున లేనిగౌరవము నిఘంటువునకుఁ గలుగునది లేదు. పొగడనంతమాత్రమున ఉన్నగౌరవమూడునదియు లేదు కాని చాలకాలముక్రిందట ప్రకటింపఁబడిన నా విమర్శనము ఏరీతినున్నదో పాఠకులకు తెలుపుట నా విధి. కావున 'భారతి'లో ప్రకటింపఁబడిన నా విమర్శన లేశైకదేశమును ఇపుడు తిరిగి ప్రకటింపవలసి వలసి వచ్చుచున్నది. నేను వ్రాసినదిది—

"నిఘంటువునకు కర్తగారు పెట్టినపేరు 'ఉభయభాషావాచస్పత్యము'......ఇది 'సంస్కృతాంధ్ర ప్రతిపదార్థపర్యాయపదనిఘంటువు.' తత్సమములును, అచ్చతెనుఁగుపదములును [తద్భవము లచ్చతెనుగులలోఁ బడియుండునేమో!] నిఘంటువుననున్నట్లు 'తొలిపలుకు'నఁ గలదు. తత్సమములైన పిదప, ఆపదము లాంధ్రపదములగునే గాని సంస్కృతపదములు కాఁజాలవు. సంస్కృతప్రత్యయాంతములే సంస్కృతపదములు. ఇది సంస్కృతభాషకు నిఘంటువు కాను. ఇందలి 'సంజ్ఞావివరణపట్టిక'ను బట్టి 'సంస్కృతార్థమును సూచించు గురుతు'లో నిచ్చిన పదములు తత్సమములేకాని సంస్కృతపదములు కావు......ఇంకను, ఇందు ఆంగ్లము, అఱవము, కన్నడము, హిందూస్థాని మొదలగు భాషాంతరములందలి పదములుదహరింపఁబడియున్నవి. కావున నిఘంటు నామైకదేశమగు 'ఉభయభాషా' పదము, నిఘంటు విశేషణైకదేశమగు 'సంస్కృత' పదము సార్థకములు కాఁజాలవని చెప్పవలసి వచ్చుచున్నది.

ఈ 'మచ్చుపదముల పొత్తము' పదిపుటల ప్రమాణముగలది. ఇందు అ, ఆ, ఉ, ఎ, క, న, ప, ల, వ, శ, హకారములకు సంబంధించిన ౨౧ పదముల వివరణము కలదు. వానిలో 'అ'ను గూర్చి ౮ ౩/౪ పుటలు నిండినవి. తక్కిన ౧ ౧/౪ పుటలలోను తక్కిన ౨౦ పదములును సచిత్రముగ వివరింపఁబడినవి. 'పండితుల' 'అభిప్రాయము'ను గోరు 'నిఘంటుకర్త'లు అన్ని యక్షరములకును సంబంధించినపదములను తాము కల్పించికొనిన నియమములకు బద్ధములైన వానిని, ఏఁబది యఱువది పదములను, 'మచ్చు'నకిచ్చినచోఁ గొంత వఱకయిన 'పండితుల' 'అభిప్రాయము'ల వెలుఁగ సాధ్యమగును.

ఈ 'పొత్తము' లోపల 'సంస్కృత.' 'తెలుగు' 'పర్యాయపదము' లలోఁ జాలవఱకు సమాసపదములే కానవచ్చుచున్నవి. ఉ. వృషశత్రువు, పదివేసముల దిట్ట; పదివేసములసామి. ఇట్టివి పర్యాయపదములుగ లెక్కించినచో నెన్నింటినైన పదముల నీయవచ్చును. వృషద్విషుఁడు, వృషద్విట్టు, వృషవైరి, వృషహంత, పదివేసములవాఁడు, పదివేసములవేల్పు మొదలగునట్టివి సంఖ్యాతీతములు కలవు. అవి లేకుండుట నిఘంటువునకు లోపము కాదు. కావున

వీలగునంతవఱకు సమస్తపదముల నుపేక్షించి సాధ్యములును, వ్యస్తములును అగువానినే నిఘంటువునం జేర్చుట లెస్స.

.......... ..........................

ఇందచ్చుతప్పు లచ్చటచ్చటం గలవు. ఈ విషయమై 'ఈముచ్చు పదముల పాత్రము నొక్క మారొక్క ముద్రాయంత్రముపై ముద్రింపవీలు కలుగనందున......అచ్చుతప్పు లచ్చటచ్చట నున్నవి... మచ్చుపదముల పాత్రమునందలి చిల్లరతప్పులను సైరింపుడని పాఠకులను వేడుచున్నాను' అను నిఘంటుకర్త 'వేడికోలు' ననుసరింపందగు; కాని యీ 'మచ్చుపదముల పాత్ర' మేం సుందరముగ, నిర్దుష్టముగ, జనాకర్షకముగ నుండిన నునుముందు నిఘంటుప్రచారమునకు మిక్కిలి యుపయుక్తమై యుండెడిది.

పైదియొల్లున్నను శ్రీ శ్యామల కామశాస్త్రిగారి ప్రయత్నము గొప్పది. కష్టసాధ్యమైనది. విలువంగట్టరానిది. వారు అవసరములగు మార్పులొనర్చి, నిఘంటువును కన్నెగూర్చుకొనిన ఆంధ్రవాఙ్మయాభిమాని కొక యమూల్యాలంకారమును సమర్పించినవారగుదురు."

పై విమర్శనమునుబట్టి నేను 'వావిళ్ల నిఘంటువు యొక్క మచ్చుపారటలను గని వారిని "బహువిధ లోపంగానియాడి"యుండక పోవుటయేకాక, కాని యాడియైన నుంగలేదని తేటపడక మానదు. శ్రీ శాస్త్రిగారు పయినుదహరించినదాని గమనింపక, ఎవరో చెప్పిన మాటలను విని నమ్మి యట్లు వ్రాసినట్లున్నది.

విమర్శనమున సూచింపబడిన సవరణలనుబట్టి ఒక్క గ్రంథనామము మాత్రమే మార్పంబడినది. నిఘంటువున సమస్తపదములే ఎక్కువయినవి. 'అహమ్' [పుట ౨౧౫.] మొదలగు సంస్కృత పదములు నిఘంటువున కెక్కినవి.

కొన్ని సంస్కృతపదము లింకను స్వేచ్ఛగ తత్సమీకరింపబడినవి. ౧. అఘన— సం. అవ్య. ఇప్పుడు. చూ. సాంప్రతము. [పుట. ౭౬]౨ అభితము. సం. వి అ. దగ్గఱ. మా. సమీపము. [పుట ౧౩౦.] సంస్కృతమునందలి అధునా, అభితః అను అవ్యయము [illegible] పదములుగ మారినవి. పయిరీతి వింతపదము లింకను ఎన్నియోని కలవు.

అర్థవివరణమునకు రెండుదాహరణములు—

౧. అధర. సం. వి. అ. స్త్రీ. ౧. ముగ్ధయను నాయిక; ౨. ప్రగల్భయను నాయిక. ౨. మధ్యాప్రగల్భలలో రెండవది. [పుట ౭౭].

౨. అనావృష్టి [illegible]—సంస్కృతభాషలో లేనివి. ౧, ౨, ౩, ౪, ౫, ౬, ౭. [పుట. ౯౮.]

పయిపదముల యర్థమేమో బోధపడకున్నది. ఇట్టివి వేనవేలు.

అలంకారపరిజ్ఞానమునకును, అన్వయపద్ధతికి నుదాహృతి.

అలంకారము [పుటలు ౧౭౦, ౧౭౧.] అను పదవివరణమున, అర్థాలంకారములలో అపహ్నవము, అప్రస్తుతప్రశంస అర్థాంతరన్యాసము నొసంగంబడి, తిరిగి 'శబ్దాలంకారము'లలో, అపహ్నుతి, అప్రస్తుతప్రశంస, అప్రస్తుతప్రసంగము, అర్థాంతరన్యాసము నొసంగంబడినవి. ఇది విచిత్రము. అర్థాలంకారములలో 'స్వాహాక్షయ'మను నొక విచిత్రాలంకారము ఒసంగబడినది. దాని క్రింది శ్లోకము చూడుడు.

'పరిసంఖ్యా నిషిద్ధ్యైక మేకస్మిన్ వస్తుయంత్రణమ్।
స్నేహాక్షయః ప్రదీపేషు నస్వాంతేషు నతభ్రువామ్."

ఇందు అలంకారనామమగు పరిసంఖ్యాపదము విడువబడి, ఉదాహరణవాక్యపదమగు 'స్నేహాక్షయము' ఒక యలంకారముగ గ్రహింపంబడినది. అప్పుడు ఉదాహరణసమన్వయ మెట్లో? పరిసంఖ్యాపదమున కపుడర్థమేమో?

'అయోగసంబంధాతిశయోక్తి' అలంకార విశేషభేదము కాదు. అసంబంధాతిశయోక్తి యను అతిశయోక్తి భేదమునకుం గలిగిన మారుపేరిది.

'యోగేఽప్యయోగోఽసంబంధాతిశయోక్తిరిష్యతే' అను లక్షణమును సరిగ నెఱుంగకపోవుటచే ఇట్లు కల్పింపవలసివచ్చినది.

'అర్థాంతరము' ఒక అలంకార విశేషము కాదు.

విషయసమగ్రత కుదాహృతి—

[పుట ౩౧౨] ఉదాత్తము—అత్యుపలక్షణ శ్లాఘ్య చరిత్ర వర్ణనము" అని నిరూపింపంబడినది. కాని యుదాత్తయొక్క విధమే కాదు. సమృద్ధ వస్తువర్ణనముకూడ నుదాత్తమగును.

ఇంక చిత్రములంగూర్చి యొకమాట. అదృష్టపూర్వములు, అశ్రుతపూర్వములు, విచిత్రములునగు వస్తువుల చిత్రములే నిఘంటువున కుపయుక్తములు. ఆంగ్లభాషా నిఘంటువు లట్టివానినే యనుసరించుచున్నవి. నిఘంటువు సచిత్రమని యనిపించుకొనుటకే కొన్ని చిత్రములు—ప్రాథమిక పాఠశాలలయందలి విద్యార్థులు వ్రాసినట్లున్నవి కొన్ని ఈ 'వావిళ్ల్ల్య'మున ముద్రింపంబడినవి. అవి ఏనుంగు, కొండ, చెట్టు, హస్తము, శంఖము, అష్టి, అనాసపండు, అరటిపండ్లగెల మొదలగునవి. ఇట్టివానివలన నేమి ప్రయోజనము కలదని నిఘంటుకర్త లూహించిరో! ఇట్టివి పాఠకుల కదృష్టపూర్వములని వారి తలంపై యుండునా?

ఈ 'వావిళ్ల్య నిఘంటువు' ను ఇదివఱకే పలువురు విద్వాంసులు విమర్శించియున్నారు. వారి విమర్శనములును చాలవఱకు యుక్తియుక్తములుగ నున్నవి. కావున విశేషించి విమర్శించుట అనావశ్యకమని యెంచి దిఙ్మాత్రముగ వ్రాయవలసి వచ్చినది. విశేషించి వ్రాసిన గ్రంథము పెరుగును,

రమారమి యిరువదియేండ్ల నుండియు అపూర్వమగు కృషిచేసి శ్రీ శ్యామల కామశాస్త్రిగారు నిఘంటువును నిర్మించుచున్నారు. ఆంధ్రవాఙ్మయమునకు మేలుకలుగునను ఆశ ఆంధ్రహృదయమున మొలకెత్తినది. ముద్రిత నిఘంటుభాగములంబట్టి యీ యాశ అడుగంటవలసి వచ్చుచున్నది.

తమ నిఘంటువు వాఙ్మయోపకారకము కావలెనని తలంచినచో నిఘంటుకర్తగారు పునః ప్రయత్నము మొదలిడుటయే మేలు.

— బులుసు వేంకటరమణయ్య

# తెలుగుపత్రికలకు చందాదార్లెంతమంది?

మల్లెల శ్రీరామమూర్తిగారు

తెనుగుదేశం విస్తీర్ణంలో చాలా పెద్దది. జనాభా రెండుకోట్లకు పైగా వుంది. హిందూదేశంలో తెలుగుభాష మూడవ స్థానం ఆక్రమించింది. ఇంతకంటె తక్కువ జనాభా గలిగిన మరాటీ, తమిళం, గుజరాతీ, కన్నడం, మొదలైన భాషల్లో చాలా దైనికపత్రికలున్నాయి. వారపత్రికలు, మాసపత్రికలు, పక్షపత్రికలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి. ఆంధ్రభాషలో వెలువడే దైనికపత్రిక ఒకటే. అది బయలుదేరి ఇరవైఏండ్లు దాటింది. అయినా యిప్పటికీ ఆపత్రిక స్వయంపోషకం కాలేక పోతోంది. నిజంగా ఇది ఆంధ్రులకు తీరని తలవంపు. ఇక తెలుగులో వారపత్రికలు చూచినా బహు తక్కువ. వారపత్రికలలో యిప్పటివున్నవాట్లో కృష్ణాపత్రిక చిరకాలంకిందట పుట్టబడింది. ఆంధ్రవారపత్రిక, త్రిలింగ, సమదర్శిని, ([illegible]వార) ప్రజామిత్ర, పత్రికలు కృష్ణాపత్రిక తర్వాత పుట్టి[illegible] ప్రచారంగల పత్రికలు. ఇంకా కొన్ని వారపత్రికలున్నా వాటికి ప్రాముఖ్యం తక్కువ. ఇక మాసపత్రికల్లో భారతి, గృహలక్ష్మి, ముఖ్యమైనవి. ఇటీవల యువకులు బయలుదేరి స్వతంత్రంగా మాసపత్రికలు స్థాపించి నడుపుతున్నారు. క్రమేణా మాసపత్రికల సంఖ్య పెరిగింది. వీటి యభివృద్ధినిబట్టి పత్రికలమీద ప్రజల కభిరుచి హెచ్చిందని గ్రహింపవచ్చు. మాసపక్షపత్రికల్లో కూడా హాస్యపత్రికలే బాగా ఖర్చు అవుతున్నాయి. ఈపత్రికల యభివృద్ధిని చూచి కొందరు తెలుగులో చాలా పత్రికలు బయలుదేరా యని సంతోషిస్తున్నారు. కొందరు యిన్ని పత్రికలెందుకని విసుక్కుంటున్నారు—ఈపత్రికలవల్ల ప్రజలకేమైనా విజ్ఞానాభివృద్ధి కలుగుతుందా అనే విషయం చర్చించడానికి తావుకాదిది. నాలుగేండ్ల క్రితం యిన్ని పత్రికలు లేకపోవడం ఇప్పుడు ఏమూల చూచినా రకరకాల పత్రికలు కనబడడం—ఇందువల్ల చాలా వున్నా యని చెప్ప[illegible]న్నారు. మనకంటె తక్కువ జనాభాగలిగిన యితరరాష్ట్రీయుల మాతృభాషాపత్రికల సంఖ్యలను, చందాదార్ల సంఖ్యలను బట్టి తెలుగుపత్రికల స్థితి చూస్తే మనం చాలా అడుగున వుంటాము. [illegible]ను చూడండి అరవభాషలో వెలువడే "ఆనందవికటన్" వారపత్రికకు ౫౨ అక్షరాలా యాభైరెండువేలమంది చందా[illegible]న్నారు. మన తెలుగుపత్రికల్లో ఏపత్రికకైనా సరే పట్టుమని [illegible]లు—అయిదువేలమంది చందాదార్లు లేరు—పత్రికల బాగో[illegible]కుబడి, వాటి విడుదలమీదనే ఆధారపడి వుంటుంది. మన [illegible] పత్రికలకు ఏపత్రికకు ఎంతమంది చందాదార్లో సరిగ్గా తెలి[illegible] లేదు. తెలుగుభాష మాట్లాడేవారి సంఖ్య ౨౬౩౭౩౭౨౭. [illegible] మాట్లాడేవారి సంఖ్య. ౨౦౪౧౧౬౫౨. మనకంటె దా[illegible] ౬౦ అరవైలక్షలు తక్కువ జనాభా కలిగిన అరవలు అరు[illegible] పత్రికలు జయప్రదంగా నడుపుతూంటే, ఆంధ్రులకున్న ఒక్క [illegible] పత్రిక స్వయంకృషిమీద బ్రతకలేని స్థితిలోవుండడం మన ఆంధ్రులపత్రికా నిర్వహణలోపాన్ని తెలుపుతోంది. దీన్నిబట్టి మన ఆంధ్రులకు మాతృభాషపై నీరసము, అనాదరణ, హెచ్చని స్పష్టపడుతోంది. హిందీ అని చంకలు కొట్టుకుని జాతీయనాయకులూ, జీతాలు పుచ్చుకుని ప్రచారం చేస్తూన్న హిందీప్రచారకులూ, యీవిషయం బాగా గ్రహించాలి. ఈస్థితిలో ఆంధ్రులు నేను ఆంధ్రుడనని మరోరాష్ట్రంవాడిదగ్గర—దివరకు అరవవారిదగ్గర నిల్చోటానికి తావువుందా యని ఆలోచించుకోవాలి. ఇక వారపత్రికల్లో కృష్ణాపత్రిక ప్రకటనలు జాస్తివేయడంవల్ల నష్టపడకుండా కొంచెంగానో గొప్పగానో లాభం తీస్తున్న దని వాడుక. మిగతా పత్రికలు ఏదో సంఘాన్నో, వ్యక్తినో, పక్షాన్నో, ఆశ్రయించుకొని ఏదోవిధంగా నడుస్తున్నాయి గాని మంచి ఆర్థికస్థితిలో లేవు. హాస్యపత్రిక లన్నీ చిల్లరఅమ్మకాలతో కాలక్షేపం చేస్తున్నాయి. అంతేగాని చందాలవలన నడుస్తున్నా యని చెప్పగలిగే పత్రిక మనకు లేదు. స్వచ్ఛమైన తెలుగుమాగాణిలోనే బెజవాడ, గుంటూరు, బందరు, రాజమండ్రి వగైరా పట్టణాల్లో తెలుగుపత్రికలకంటె ఇంగ్లీషుపత్రికలు మూడురెట్లు దిగుమతి అవుతున్నాయి. కరువులో అధికమాసం అన్నట్లు ఇంగ్లీషుపత్రికల చలామణి అలావుండగా జాతీయత్వం అనే ముసుగుతో బయలుదేరిన హిందీప్రచారం మూలంగా చాలా మంది తెలుగుపత్రికలైనా కొననివారు హిందీపత్రికలు కొంటున్నారు. తెలుగుసీమలో మాధురి మొదలైన హిందీపత్రికల కున్న చలామణి తెలుగుపత్రికలకు లేదు. ఇది చాలా గర్హ్యము. రాష్ట్రాభిమానం గలిగిన ఏరాష్ట్రీయుడూ యీపనిని విమర్శింపకుండ నుండజాలడు. జాతీయాభిమానంకంటె ముందు రాష్ట్రాభిమానం స్థిరపరచుకోవాలి. రాష్ట్రాభిమానం లేని జాతీయాభిమానం ఆత్మహత్యతో సమానమే. కాంగ్రెస్‌వ్యవహారంలో యితరరాష్ట్రాలవారితో పాటు ఆంధ్రులు కూడా పాల్గొని పేరుప్రతిష్ఠలు గడించారు. కాని యితరరాష్ట్రాలవారి కున్న రాష్ట్రాభిమానం ఆంధ్రనాయకులకు చాలా తక్కువ. అంతేకాదు అసలే లేదు—ఒక్క చిన్నవిషయంలో యితరరాష్ట్రకాంగ్రెస్ నాయకుల రాష్ట్రాభిమానం గమనించవచ్చు. వంగదేశీయుల రాష్ట్రాభిమానం విషయం అందరికీ తెలిసిందే గనుక మరోరాష్ట్రం విషయం వ్రాస్తాను. గతసంవత్సరం బొంబాయిలో జరిగిన అఖిలభారతకాంగ్రెస్ మహాసభకు ఆంధ్రదేశంనుంచి కొందరు యువకులు కాలినడకతో వెళ్ళారు. బొంబాయిలో మహాసభాహ్వానసంఘాధ్యక్షులైన కె. యఫ్. నారిమెన్ గారిని దర్శించి కాంగ్రెస్ వాలంటీర్లుగా చేర్చుకోమని ప్రాధేయపడ్డారు. బొంబాయిరాష్ట్రం వారిని తప్ప మరొక రాష్ట్రంవారిని వాలంటీర్లుగా చేర్చుకో వీలులేదని నారిమెన్‌గారు ఖండితంగా చెప్పారు. మనయువకులు ఆదరించే దిక్కులేక తెల్లమొఖాలతో యింటికివచ్చారు. దీన్నిబట్టి ఆంధ్రజాతీయనాయకులు, ఆంధ్రప్రజలు గమనించి

చేర్చుకోవాల్సింది ఏమిటి? ముందు రాష్ట్రాభిమానం. తర్వాతనే జాతీయత. ఆంధ్రులు ఆత్మపరీక్ష చేసుకొని సవరణలు చేసుకోవాలి. వర్తమానకాలంలో దేశానికి పత్రికలద్వారా జరిగే ప్రబోధం ప్రచారం మరోవిధంగా జరగడంలేదు. ఇతరరాష్ట్రాలవారి జనాభా, మాతృభాషాపత్రికలసంఖ్యలనుబట్టి, ఆంధ్రుల విషయం పరిశీలిస్తే ఇప్పుడు మనకున్న పత్రికల సంఖ్య బహుస్వల్పం. ఉజ్వలమైన రూపంలో రాష్ట్రాభిమానం వెదజల్లుతూ యింకా ఎన్నో బయలుదేరాలి. మనకున్న ఒక ఆంధ్రదైనికపత్రికకూ నాలుగువేలమంది చందాదార్లని కొందరూ మూడువేలకే తక్కువని కొందరూ అనుకుంటున్నారు. మిగతా వారపక్షపత్రికల చందాదార్ల విషయంలో కూడా తలోమాటగా వుంది. ఇక తెలుగుపత్రికల ఆర్థికస్థితిగతులు తెలియటానికి, పత్రికాప్రపంచంలో మన ఆంధ్రులు ఎంత వున్నతస్థితిలో వున్నారో గ్రహించటానికి మన ఆంధ్రుల మాతృభాషాభిమానం వెల్లడికాటానికి ఇప్పుడు నడుస్తూన్న తెలుగుపత్రికల విడుదలసంఖ్య, చందాదార్లసంఖ్యలు బయలుపడడం చాలా అవసరంగా కనపడుతోంది. ఈసంఖ్యలు ప్రజలకు తెలియడంవల్ల పత్రికలస్థితి ప్రజలకు తెలుస్తుంది. అందువల్ల పత్రికలకు లాభమే గాని నష్టమే మాత్రమూ లేదు. పత్రికల పలుకుబడి, గౌరవం, వాటి విడుదల మీదనే ఆధారపడివుంటుంది. పాశ్చాత్యదేశాల్లో పత్రికలకు లక్షలమంది చందాదార్లని పత్రికల్లో చూస్తున్నాము. దాన్నిబట్టి వాటి పలుకుబడి తెలుస్తోంది. ఆనందవికటన్ పత్రికవారు ప్రకటనల్లో ౫౦ వేల సంచికలు ఖర్చుఅవుతున్నా యని బహిరంగంచేసుకుంటున్నారు. పత్రికల చందాదార్ల సంఖ్య విడుదల సంఖ్య వకరు నిర్ణయించేది కాదు. పత్రికాధిపతులు మనఃపూర్వకంగా ప్రకటిస్తేనే వాటి యథార్థం తెలుస్తుంది. కాబట్టి తెలుగుపత్రికాధిపతు లందరు తమ పత్రికల చందాదార్ల సంఖ్యలు పత్రికల్లో బహిరంగంగా ప్రజలకు తెలియచేస్తే తద్వారా పత్రికాభివృద్ధికి ప్రజలు తోడ్పడుతారు. ప్రస్తుతం పత్రికాపాఠకుల సంఖ్య చాలా పెరిగింది. క్రమేణా వృద్ధి అవుతోంది. పత్రికాధిపతుల ప్రోత్సాహంవల్లనే వాటి ప్రచారం కూడా అధికమౌతుంది. కాబట్టి పత్రికాధిపతులు పై నా యభిప్రాయాలను గమనించి తమ పత్రికల విడుదలసంఖ్యలు ప్రకటిస్తారని ప్రార్థించుచున్నాను—ఇతరరాష్ట్రాలవారి మాతృభాషాపత్రికల సంఖ్య. చందాదారుల సంఖ్యలు తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూన్నాను. తెలిసినవారుంటే పత్రికలలో ప్రకటించాలని కోరుతూన్నాను—

# కొన్ని శబ్దముల కథలు

సురవరం ప్రతాపరెడ్డిగారు బి.ఏ., బి.ఎల్

మా శ్రీపాదశాస్త్రిగారితో మాటలసందర్భమున నాపుస్తకములో వ్రాసికొనిన కొన్ని శబ్దముల చరిత్రను ముచ్చటించి యుంటిని. కాని వాని నింత త్వరగా ప్రకటించదలచియుండలేదు. మా శాస్త్రిగారు మాత్రము ఇప్పుడే కావలెనని పట్టుపట్టినారు. సంస్కృతిఫార్సీ భాషలకు పరస్పరసన్నిహితసంబంధ మెట్లు కలదో, ఈరెంటికిని కించిద్భేద మెట్లేర్పడెనో, ఎన్నడేర్పడెనో ఇత్యాదివిషయముల నొక చిన్నగ్రంథముగా వ్రాయతలపెట్టియుంటిని.

అప్పుడు నేను సంగ్రహించియుంచిన ఫార్సీశబ్దములను గురించియు వ్రాయదలచియుంటిని— అదెన్నడో యేమోకాని యిప్పుడు మాత్రము నాకు తోచిన కొన్ని శబ్దములనిందు ప్రకటించుచున్నాను. నేను వ్రాసిన అభిప్రాయములు సరిగాకపోవచ్చును. విమర్శకులకు మార్గదర్శకముగనైన నుండవచ్చునను ఊహతో ప్రకటించుచున్నాను.

౧ ద్వార—ద్వి + ఆర రెండురెక్కలు కలది. ప్రాచీనమందు ఒంటిరెక్క తలుపులకన్న రెండురెక్కల తలుపులే విశేషమేమో.

౨ దప్పు—ఇది ఉత్తరసర్కారులలో విశేషము వాడుకలో కలదు. ఫార్సీలో దఫ్ అని కలదు. తప్పెట అను నర్థములో నుపయోగింతురు.

౩ హంవీరుడు.—శూరుడను నర్థములో ప్రయుక్తము. తారాశశాంకవిజయమందు ప్రయోగించబడినది.

"దండిహంవీరతలగుండుగండ" అని శుకసప్తతిలో(పు.౧౨౫) కలదు. "రాజమాన్యహంవీరులు ధక్కణీలు"అనియునొకచాటువు. హంవీరుడు రాజపుత్రస్థాన చిత్తూరురాజగు అర్సికుమారుడు. మహావీరుడగుటచే శూరపదపర్యాయ మయ్యెను.

౪ దేవానాంప్రియ—ఇది షష్ఠీతత్పురుష అలుక్సమాసము మూర్ఖు డను నర్థములో వాడినారు. అమరసింహుడు త్రికాండశేషములో దీని యర్థము "భాగము"అని వ్రాసెను. భాగసమానుడు మూర్ఖుడు. మరియు భాగము యజ్ఞములందు దేవానాంప్రియమైనది. నిఘంటుకారులు మూర్ఖునికే యీపదము అలుక్సమాస స్వరూపమందే వర్తించు ననిరి. దీనికి చారిత్రికకారణము బౌద్ధులు తమ మతమందు శ్రేష్ఠులైన వారిని "దేవానాంప్రియు" అని పిలుచుచుండిరి. అశోకచక్రవర్తి బిరుదులలో నిదొకటి. హిందువులు బౌద్ధులను హేళనము అవమానము చేయు నుద్దే నీయలుక్సమాసము మూర్ఖనిర్వచనము చేసియుందురు.

౫ హజారము—దర్బారు అను నర్థములో వాడుదురు. హుజూరీ నుండి వచ్చియుండును.

౬ హసాదు—"చిత్తము ఆజ్ఞ" అను నర్థము. హంసాద్ దానినుండి యేమో.

౭ చొక్కా—అంగి. ఫార్సీలోని "చోగా" నుండియే నిస్సందేహము.

౮ కాగితము—ఫార్సీ—కాగజ్ నుండి

౯ బులాకీ—ముక్కుకొనను అలంకారముగా (?) వాడుకొను ఆభరణవిశేషము. ఫార్సీలో "బులాఖ్" ఈ ఆభరణమును ముసల్మానులే తెచ్చి ఈ దేశ స్త్రీల ముక్కుల కెక్కించినారేమో, ఆలోచించుడు.

౧౦ కండిల్—హైద్రాబాదులో ప్రయుక్తము. దీపమని యర్థము. ఇంగ్లీషు క్యాండిల్ Candle నుండి వచ్చిన దీవెలుగు.

౧౧ గడ్డినూనె—ఉత్తరసర్కారులలో నున్నదో లేదో కర్నూలులోనిఖాంరాష్ట్రములో కొన్ని భాగములలో కిరోసన్ నూనెకు పర్యాయపదముగా నున్నది. కిరోసిన్ నుండి గ్యాస్ కూడ వచ్చును కాన గ్యాసును ముసల్మానులు తిన్నగా ఘాస్‌నూనెనుగా జేసిరి. ఉర్దూలో ఘాస్ (ఘాసశబ్దమే) అనగా గడ్డి కావున కిరోసిన్ గడ్డినూనె అయినది.

౧౨ చీనాగొలుసు—ఇది సంబిసోవయాజికంటి పదము. ఇంగ్లీషు చైన్ (Chain) అనగా గొలుసు. అక్స్ ox ఎద్దు అన్న చందమున పరిణామమే చైన్‌గొలుసు తుదకు చైనాగొలుసు, చీనాగొలుసు అయినది. (చీనాదేశమునకిప్పుడిప్పుడే గొలుసు సంబంధము కలుగుచున్నది.)

౧౩ పంబలి—ఒక శైవజాతి—తాంబూలశబ్దభవమని తలతును. పూర్వము ఒక్కొక్కజాతి కొక్కొక్క వృత్తి. పంబలకు పూజయే కాక పూలను దెచ్చి వర్తనగా తెచ్చియిచ్చుట ("పంబివానిచ్చిన గన్నేరు పువ్వులు" అని శుకసప్తతికారుడు) ఆటులే తంబళ్లకు గ్రామములో తమలపాకుల నిచ్చుట.

౧౪ యోజన—ఈశబ్దము ఒక యూరపుపాపె వగును, ఒకచోట నన్నెందగును. కొందరు పదిమైళ్లందురు. కొందరు ఎనిమిది, మరి కొందరు ఆరు మైళ్ళు. యుజ్యతేతి యోజన. ఎద్దులను బండికి కట్టుట యను యర్థము. అనగా ఎద్దులబండి ఒక దినములో ఎంతదూరము పోగలదో అంతదూరము. అది ౫ మైళ్లనుండి ౧౦ మైళ్లు కావచ్చును. కాలమును బట్టి ఎద్దులను బట్టి యది నిర్ణయింపదగినది.

౧౫ సెమ్మె—దీపముపెట్టు స్తంభము అని యర్థము. ఫార్సీలో "శమా" అనగా దీపము (దీపస్తంభము కాదు) దానినుండియే మన సెమ్మె ఏర్పడినది.

౧౬ కాకపక్షము—గిర్దాలు. జంపాలు. కాకిరెక్కలవలె ఉభయపార్శ్వములం దుండునవి. శ్రీరామునకు కాకపక్షముండెనని వాల్మీకి అభిప్రాయము.

౧౭ కవాటము—పాణిని కాలములో మనదేశమందు తలుపులు విస్తృతిగా నుండెనేమో. కలితలను, పాటయతీతి—పగులగొట్టునది కనుక—కవాట మయ్యెను.

౧౮ కీసర—కీస అని కూడ నందురు. జేబు అని యర్థము. ఈ జేబుకూడ అన్యదేశ్యమే. (మన పూర్వులకు జేబులు లేకుండె ననుమాట. మన మెప్పుడును పరులకై జీవించువారము కాన మనకు జేబు లెందుకు.?) కీసర్ అని ఫార్సీరూపమునుండి వచ్చినది.

౧౯ దుహిత—బిడ్డ అని యందరకు తెలిసినదే. ఈశబ్దారము రెండు విధములు, ఈఅర్థములో ప్రాచీనులయింటిబిడ్డ యొక్క స్థానము విశద మగును. దుహ్-ధాతువు. పితుకుట అను దానినుండి వచ్చిన దీపదము. పూర్వము ఇంటి యాడుపడుచు దినము ఆవులను బర్రెలను చూచుకొనుచుండె నని యూహ్యము. ద్విహితా—రెండు కుటుంబములకు—పుట్టినయింటికి మెట్టినయింటికి—హితురాలు అగుటయు కావచ్చును.

౨౦ పునాస—వర్షాకాలారంభమున విత్తునట్టి పంటయని అర్థము. పునర్వసుకార్తెలో సజ్జలు, కొర్రెలు, మున్నగునవి వేయుదురు. ఈపునర్వసునుండియే పునాస పద ముద్భవించిన దని నాయూహ.

౨౧ అక్ష (మాల)—

శ్లో. అదిక్షాంతార్ణయోగిత్వా దక్షమా లేతి కీర్తితా
తద్వర్ణసంఖ్యైర్మణిభి ర్జపమాలాం ప్రకల్పయేత్.

—శారదాతిలకము—

౨౨ ఏడుగడ—

క. గురుడును (౧) తల్లియు (౨) దండ్రియు (౩)
బురుషుడు (౪) విద్యయును (౫) దైవము ను (౬) దాతయు (౭) నా
భోరి కేడుగడయు దానై
హరి నను రక్షించుగాత ననవరతంబున్

—వాసిష్ఠము—

౨౩ హెగ్గడి—ద్వారపాలకుడు. బహుభార్యాయుక్తు లగు రాజులు నాటికి నేటికి తమ దేవిడీల వద్ద పురుషుల పహిరాను అంతగా పసందుచేయరు. నపుంసకులను అంతఃపురమువద్ద కావలి పెట్టుచుందురు. ఉర్దూలో హిజ్డా అను పదముయొక్క అపభ్రంశమో హెగ్గడియై యుండును.

౨౪ చిలువ—చీలిన—వ—నోరుకలది—పాము.

౨౫ వలువ—వ్రాల్గు—వ—నామములవాడు. ఇట్లే గట్టివ మున్నగునవి.

౨౬ కింపచ—దరిద్రుడు—ఉండిన మేమి వండుకుందునా అని చెతులు పిసికికొనువాడు.

౨౭ ముత్తైదువ—అయిదువన్నెలు కలది—మంగళసూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు—కడపటిది అరవల సొమ్ము. తెలుగు స్త్రీలకు మట్టియలు—(మెట్టెలు).

౨౮ హురుమంజి—హురుమంజి ముత్యములు. పర్షియాదేశపు సంధిని హురుముజ్ సంధి యందురు. (Gulf of Hurmuz పూర్వము మనదేశాని కీసముద్రభాగమునుండి తీసిన ముత్తెములు విశేషముగా దిగుమతి యగుచుండెను.

౨౯ సంగసాని—ఈ పేరుగలది ఏలేశ్వరోపాధ్యాయుల కూతురనియు నామె నొక కంసాలి తనకులము దాచి వివాహ మాడెననియు తదనంతర మామాట యెరిగి యామె యాత్మహత్య చేసి

కొనె ననియు అప్పటినుండియు "ఎంతటి సంగసానివే" అనిన "ఎంతటి సాహసురాలవు" అను సామెత యయ్యె ననియు కొందరందురు. హిందీలో నగ్నము (నంగా) గా ఆడునట్టి (నాచ్) స్త్రీల నృత్యమునకు నంగానాచ్ అందురు. ఆనృత్యము చేయు స్త్రీ సాహసురాలు కాదా! అంతటి సిగ్గువిడిచిన దను నర్థము ప్రయుక్తమే కాని ఏలేశ్వరోపాధ్యాయుని కూతురునకు మంచిపేరు దొరకక యంతటి సుందర నామము పెట్టియుండరు.

౩౦ మోజాలు—బద్దాము పాదరక్షలకే యీపే రుండెను. ఆదేశము నుండి దిగుమతి యగుచుండెను.

౩౧ దేవా—ద్వితీయో వరః. మరది వితంతు వైన వదినెను నియోగన్యాయముచే ద్వితీయవరు డైయుండెను. ఉర్దూ హిందీభాషలలో నీపదమే (దేవర్) అని నేటికిని మరదికి వాడుచున్నారు.

౩౨ దరువేసి—యోగి. ఫార్సీలో దర్వేష్, ఒక తెనుగు కవి (శృంగార అహల్యాసంక్రదన మేమో?) యీ పదమును ప్రయోగించినాడు.

౩౩ వర్గ—అధ్యాయము, భాగము, ప్రకరణమను నర్థము. ప్రాచీనకాలములో గ్రంథములు ఆకులపై వ్రాయుచుండిరి. ఫార్సీలో బర్గ్ అన ఆకు (బవయోరభేదః—వర్గ్)

౩౪ సూక్త—(హోమము చేయునప్పు డుచ్చరించు) మంత్రము. ఫార్సీలో సొఖ్త్ అన కాల్చుట, వ్రేల్చుట అని యర్థము.

౩౫ పుస్తకము—ఫార్సీలో పొస్త్ అన చర్మము. బహుశః ప్రాచీనమందు గ్రంథములకు జింకచర్మములు మున్నగునవి అట్టలుగా నుంచుచుండిరో లేక చర్మపు సంచులలో గ్రంథముల భద్రపరచుచుండిరో యని దీనివలన గ్రహింపవచ్చును.

౩౬ ద్విబిస్తా—బిస్తా రం రతుల తూకపు బంగారు నాణెము. (సూ. అపరిమాణ బిస్తాచితకం బళ్యేభ్యోఽనతద్ధితలుకి.) రెండుబిస్తాలకు కొన్న బానిస స్త్రీ.

౩౭ పంచాశ్వా—అయిదు గుర్రము లిచ్చి కొన్నట్టి బానిస స్త్రీ. ఈరెండు పదములను బట్టి ప్రాచీనార్యులలో బానిసలను కొనుటయు, అట్టి వ్యాపారమందు బానిసల విలువయు తెల్లడియగు చున్నది.

౩౮ చండాల—సుప్రసిద్ధుడే! ఫార్సీలో నీచుని జందాల్ అనిరి.

౩౯ దేవ అసుర—ఈపదముల కర్థము ఫార్సీలో అపసవ్యముగా నున్నది. దేవ్ అన భూతము లేక రాక్షసి అని, అహుర్ (ఫార్సీలో సకారమునకు హకార ముంచుదురు. ఉ॥ సప్త=హప్త, సింధు=హింద్) అనగా ఫార్సీమతమున మంచిదేవత. ఫార్సీలు, ఆర్యులును మొదట ఏకస్థులుగా నుండి సురాసుర పూజాదులందు భేదాభిప్రాయులై వేరైన, నాటనుండి యీపరస్పరవిరుద్ధార్థములు ప్రారంభమై యుండును.

# కళాస్వరూపం

కొడవటిగంటి కుటుంబరావుగారు

"కళ" అనే మాట చాలామందికి వినటానికి గాని వాడటానికి గాని అమితఅసహ్యం. దానికి తగినంత కారణం లేకపోలేదు. ఆ రెండక్షరాలచేతనూ నిర్దేశించబడే వస్తు వేదైతే ఉందో దాన్ని గురించి తమకు స్పష్టంగా తెలియకపోవటం ఒక కారణం; ఇక ఎన్నటికీ తెలియబోదనే గట్టినమ్మకం రెండో కారణం. ఆమాట ఉపయోగిస్తున్న కళావిదుల కైనా తమకన్న కళను గురించి అధికంగా తెలియదేమో ననే సంశయం మూడో కారణం. ఈజాతికి చెందినదే రెండక్షరాల మాట ఇంకొకటికూడా ఉంది—"ప్రేమ"

ఇటువంటి పదాలు వాడినప్పుడు ఎవరెవరికి కడుపులో తిప్పుతుందో వారందరికీ నాసానుభూతి తెలియచేస్తున్నాను. పుట్టిపెరిగిన ప్రతిపత్రిక చేతా ఉత్తమకళావిదు డని ఆమోదింపబడ్డ సావం నరసింహారావుగారివంటి వ్యక్తి ఒకటికి పదిసార్లు "కళోపాసనయే బ్రహ్మోపాసన" అని మాట్లాడటానికి అవకాశం చిక్కినచోటల్లా ఉపన్యాసం దంచేస్తుంటే, కళను భూతద్దంలోంచి చూపించినా గుర్తుపట్టలేనివాళ్ళు, ఈకళ స్వరూప మేమిటో తెలుసుకుని కళాసేవ చేతా మనుకుంటున్నవాళ్ళూ బెదిరిపోవటం తప్ప జరగగలది ఏమైనా ఉందా? కళ అంటేనే తెలీకుండా ఉంటే బ్రహ్మ [illegible]?

నరసింహారావుగారిని కాని, వారికి మద్దతుగా ఉండుకున్న పత్రికాధిపతులను గాని చులకన చేసి మాట్లాడాలని ప్రయత్నించటం లేదు. ఈ విధమైన మంత్రాలతో మామిడికాయలు రాలవని మాత్రం మనవిచేస్తున్నాను. ఈ ధోరణిలో వెయ్యిసంవత్సరాలు ఉప న్యసించినా జనసామాన్యానికి కళ ఎడంగా ఉండటమే కా కొంతకాలానికి జనసామాన్యానికి తిక్కరేగి కళ అనే మా ఉచ్చరించినవాడికీ వాడి కళకూ గిద్దెడు నీళ్లు పుట్టకుండా కూ పోవచ్చును. ఇది శ్రేయస్కరమైన విషయం కాదు. అసంభవ కాదు. ఊరూ పేరూ దాదిపెట్టి ఎవరిని గురించి అయినా మా డటం మొదలుపెడితే వినేవాడికి చిరాకువేస్తుంది త్వరలో. ఎ ఎన్నడూ కనీ వినీ ఎరగని వస్తువును గురించి మాట్లాడదలచిన ముందు చెయ్యవలసినపని దాన్ని విపులంగా వర్ణించటం. చెయ్యకుండా ఉపన్యాసం అవస్తువును "గురించి" సాగిస్తే లేచిపోతారు. ఉపన్యాసకుడు మరోమెట్టుపైకి వెళ్లి దాన్నిగు తనకు ఉద్రేకం—ప్రేమ గానివ్వండి, భక్తి కానివ్వండి, భయమై నివ్వండి!—ఉన్నట్టు కూడా కనపడ్డాడా! ఇక వాడికింక కష్టేసాం.

అండమానుమహాపట్టణం చూచివచ్చినవ్యక్తి ఆ అదృష్టం పట్టనివ్య ఎదట సంభాషణలో అండమాను తన సొంతమామగారిదూ కన్నట్టు

చవచ్చును కావాలంటే. అట్లాగే ఒక వ్యక్తి ఇతరవ్యక్తుల ఎదట తనకు కళతో బాల్యస్నేహం ఉన్నట్టు నటించవచ్చును. కాని ఆ స్నేహమే అందరూ చేసుకునేటట్టు చూడటం ధర్మం. ఇందులో అరగిపొయ్యే దేమీ లేదు కనక. కళ ఒకరి సొత్తు కాదు కనక.

"కోతి" "మనిషి" మొదలైన పదాలు వాడినప్పుడు వినేవాళ్లలో ఏవిధమైన వికారం గాని పుడుతుం దనే భయం అవసరం ఉండదు. ఆపదాలు ఏవస్తువును నిర్దేశిస్తున్నవో స్పష్టంగా తెలిసిపోతుంది. ఎవడైనా తెలుసుకోలేనివా డుంటే అందరూ కలిసి వాడి జ్ఞానం పట్టించటమే కాక ఒక్కొక్కసారి ఆమనిషి శిక్షార్హుడు కూడా అవుతాడు. కనకటికి ఇట్లాగే మాఊరి కొక దొరగారు వస్తే నలుగురు గడ్డాలూ మీసాలూ పెరిగినవాళ్లే "కోతరోయ్!" అని దొరగారిమీద రాళ్లు రువ్వారట. ఇది కోతి—ఇది మనిషి అని తెలుసుకోలేనందుకు మాజిస్ట్రేటుగారు తలా కాస్త వదిలించారట. కనక జనసామాన్యానికి మనిషిని మనిషి అని పోల్చుకోవటం ఎంత సులభసాధ్యమో కళను—ఒక్క కళనే కాదు, ఇమిటేషన్ కళను కూడా—పోల్చుకోవటం అంత సుకరం కావాలి. అంతవరకూ ఎంతకళావిదుడు కానీ కళను గురించి గొంతు చించుకోవటం అరణ్యరోదనమే. ఆతరవాత కళోపాసన బ్రహ్మోపాసన ఎందీ కాందీ కావలసినంత మంది నిర్ణయిస్తారు. ఇప్పుడంటే విషయమూ నరసింహారావుగారి మాటే ఆధారంగా ఉంది.

అయితే ఒకటి ఉంది. ఒక వస్తువును ఎంతవర్ణించినా జరగని వస్తువును పదేపదే ప్రదర్శించటం వల్ల సులభంగా జరుగుతుంది. "మేము కళాప్రదర్శనములు చెయ్యటం లేదా?" అని అడగవచ్చు. బాగానే ఉంది. మరి మీ కళాప్రదర్శనాలకూ మీరు వాటిని గురించి చెప్పే దానికీ ఎక్కడా లంగరందటం లేదు. పిల్లిని చూపి "ఇది కుక్క. దీనికి ఆరుకాళ్ళూ, రెండుకొమ్ములూ, రెండు తోండమూ కలవు. దీని బరువు సుమారు అయిదువేల టన్నులు!" అన్నట్లుగా ఉంది మీ ఉపన్యాసం. మీకళాప్రదర్శనకూ బ్రహ్మకూ ఏవిధమైన బాంధవ్యమూ స్ఫురించటం లేదు.

కళావిదులు ఇంకోధోరణిలో కూడా మాట్లాడతారు. ఎవరైనా సామాయకుడు "మీకళాప్రదర్శనంలో కళ నేతిబీరకాయ చందంగా ఉంది" అంటే, "మీకు రసగ్రహణపారీణత లేనట్టుంది. తేంచెయ్యండి!" అని సమాధానం చెబుతారు. ఇటువంటి ఒక్క వాక్యంతో చాలా గుట్టు బట్టబయలౌతుంది. ఏమిటి. ఈ మాట కళావిదుణ్ణి అని చెప్పుకుంటున్నవాడెవడైనా అంటే అతడికి కళను గురించి ఏమీతెలీ దనీ, తెలుసునే ఘోర భ్రమ లేదని వెంటనే కనుక్కోవచ్చును!

సామాన్యానికి మీ కళను తెలుసుకుని ఆనందించే యోగ్యత లేదా? మీకళను తెలుసుకుని ఆనందించటానికి కొంత ట్రెయినింగు కావాలా? అయితే మీరు కళ అనుకుంటున్నది, పాపం, కళ కాదు.

కళాప్రకటన యొక్క ఉద్దేశం ఏమిటి? రసోత్పాదన ప్రేక్షకులలో కలిగేటట్టు జరిగించే భావప్రకటన కళ అవుతుంది. నవరసాలలో ఏదో ఒకటి తీసుకుని దాన్ని ప్రకటించి—లేక ప్రకటించా మనుకుని—మేము చేసింది కళాప్రదర్శనమే అంటే లాభంలేదు. అది కళ కాదు. కళయొక్క ముఖ్యోద్దేశం ప్రేక్షకుడి యందు రసోత్పాదన కలిగించి అతడికి రసానుభవం ఇవ్వటం. రసానుభవం పొందటానికి ట్రెయినింగు అవసరం లేదు. పంచేంద్రియాలు సహజంగా పనిచేస్తున్నవారంతా కళను ఆనందించటానికి అర్హులే. ం

కళను ఆనందించటం కొందరకొల మనుష్యులకు అసంభవం. అందులో మొదటివారు జాత్యంధులూ బధిరులూ మొదలైనవారు. వీరికి ముక్తి లేదు. రెండోరకంవారు జీవితసరిత రనలవల్ల ఒకవిధమైన గుడ్డితనమూ చెవుడూ సంపాదించినవారు. బజారులో అడుగు పెట్టగానే "కళ్లులేవు, బాబయ్యా!" అంటూ బిచ్చగాడు సమీపిస్తాడు. వాడి గొంతులోనూ ఆకారంలోనూ కావలిసినంత దైన్యం ఉంటుంది. కాని ఆదైన్యంచేత కలవరపడటానికి ఒప్పుకుంటే కొద్దిరోజుల్లోనే జీవితం దుర్భర మైపోతుంది. గుండె బద్దలయిపోతుంది. మానవుడు ఒకవిధంగా జీవించాలంటే గుండె రాయి చేసుకోవాలి. ఈ విధంగా మన హృదయాలు నిజమైన రసానుభవానికి దూర మవుతై. నిజానికి మనిషి ఇట్లా కావటం అట్టే శ్రేయస్కరం కాదు. జీవితంలో మనని మింగెయ్యాలని చూసే రసాలకు పెడమొహం పెట్టినవాడు హృదయం రాయి కాకుండా ఉండాలంటే తప్పకుండా ఉత్తమజాతి కళను ఆనందిస్తూ ఉండటం అలవాటు చేసుకోవాలి.

ఈ విధంగా నూటికి ఒకరిద్దరు పోగా మిగిలినవారిలో కూడా ఒకరికన్న ఒకరు అధికంగానూ తక్కువగానూ రసాలను ఆనందించగలిగి ఉండవచ్చును. ఒకరికన్న ఒకరు సున్నితంగా వినగలిగినట్టు చూడగలిగినట్టు కాని అంతా రసానుభవం పొందగలవారే.

అయితే మరి "మాకళాప్రకటనలోగల కళ మీరు అర్థంచేసుకోలేరు" అనటం ఎందుకు కలిగిం దంటే, నేనేసమాధానం చెబుతాను.

ఒక గాయకశిఖామణి పాడిపోతాడు. ఏనలుగురో ఆయనకు ఎదురుగా కూర్చుని "ఓహో!" అన్నారు. మిగినవాళ్లు గడ్డం పెట్టుకు చూసి ఇవతలికి వచ్చేశారు. ఈ ఆనందించలేనివారిలో ఏ ఒకడైనా "నీ ప్రదర్శనం అఘోరించినట్టున్నది" అంటే గాయకుడు మండిపడి "నీకు సంగీతాన్ని గురించి ఏంతెలుసు?" అంటాడు. "ఏం తెలియాలి?" అనటం తెలీక ఆనందించలేనివాడు ఆనాటి నించీ సంగీతాన్ని బహిష్కరిస్తాడు. దాన్ని ఆనందించగలిగినట్టు కనపడేవాళ్లను తన విరోధు లల్లే భావిస్తాడు. కొన్నాళ్ళ కామనిషిని గురించి "వీడికి చెవిలేదు!" అంటాము. వాడికి చెవి ఉందో లేదో చూడాలంటే, హార్మోనియంమీద షడ్జప్రతిమధ్యమ స్వరాలు ఒక్కసారిగా మోగించి మేళవించి వినిపించండి. వాడు చెవులు మూసుకున్నంతకాలమూ వాడికి చెవి ఉన్నట్టే. ఇక చెవిలేని దెవరి కంటే సంగీతం పాడే ఆయనకూ, "ఓహో!" అనే వాళ్లకూనూ. వాళ్లకైనా చెవిలే దని కాదు. ఉన్న చెవి కొంకరపోయింది.

ఒక నటుడు, ఒక గాయకుడు, ఒక కవి "నీకు తెలీదు" అన్నప్పుడు వాళ్ల ఉద్దేశంలో తెలీని దేమిటి? టెక్నిక్! ఎవడైనా రాగజ్ఞానమూ తాళజ్ఞానమూ ఇంకా ఏమేమి సంగీతశాస్త్రజ్ఞానం ఉండాలో అదంతా ఉన్నవాడు వచ్చి "మీక్కూడా ఇంత జ్ఞానముందా?" అని ఆశ్చర్యపడితే సంగీతసార్వభౌముడు సంతోషిస్తాడు! అట్లాగే ఒక బొమ్మను చూసి "ఓహో ఏమి డ్రెస్! ఏమి కడియేషన్! ఏమి కియరోస్క్యూరో!" అంటే ఆ బొమ్మను గీసిన పెద్దమనిషి చాలా పొంగిపోతాడు. ఒకవిధంగా ఈజాతిలో కవి ఒకడే శాలి. "అహా! మీకవిత్వంలో ఏమి నాటకం! మీ శైలి ఏమి నయాగరా జలపాతం! మీ పదప్రయోగంలో ఏమి ధ్వని!" అంటే ఇప్పటికవి సంతోషించడు. "అవాఙ్మానసగోచరమైనటువంటిదిన్నీ భావాతీతమైనటువంటిదిన్నీ అయిన గూఢభావం మీకవిత్వంలో ఉంది. మిస్టిసిజం మీ పద్యాల్లో శరీరం ధరించింది!" అంటే కవి సంతోషిస్తాడు.

ఈ పరిస్థితులలో కళకు ఏమాత్రం పరపతి ఉంటుందో, జనసామాన్యానికి కళ అనే ముక్క చెవిని పడితేనే ఏవగింపు ఎందుకు కలుగుతుందో బుద్ధిమంతులు సులభంగా గ్రహించగలుగుతారు.

కళ శాస్త్రం కాదు. కాని కళాప్రదర్శనంలో శాస్త్రం ఎంతవరకు ఉపకరిస్తుందంటే టెక్నిక్‌తో ఉపయోగం ఉన్నంతవరకు. కళాప్రదర్శనంలో టెక్నిక్ గోప్యంగా ఉండాలి. అది ఏమాత్రం ప్రేక్షకుడి కంటబడినా రసాభాసం కాకతప్పదు. తొడమీద దబాయించి తాళం వేస్తూ వాడే పాటగాడూ, "నాబొమ్మ నేం చూస్తారు; దాన్ని గియ్యటంలో నేను చూపించిన చాతుర్యం చూడండి! అట్లు గియ్యటానికి నేను ఉపయోగించిన బ్రష్ చూడండి!" అనే చిత్రకారుడూ మొదలైన కళోపాసకులు నిజానికి టెక్నిక్ ఉపాసకులు. కళ అంతుపట్టనివాడు టెక్నిక్ ఉపాసన చెయ్యక ఏంచేస్తాడు? బాబూరావు పెయింటరు స్టుడియోలో గుడ్డలతో కైలాసగిరి ఏర్పాటుచేశాడు. అది మన కళ్లకు కైలాసపర్వతం మాదిరిగా కనపడేటట్టు చెయ్యగలిగినతరవాత అతను "ముందునించి ఏంచూస్తారు? వెనక కట్టిన తాళ్లూ బద్దలూ చూడండి!" అంటాడా? ప్రాణంపోయినా వాటిని ఫిలింలో కనపడనిస్తాడా? ఏగాయకుడయినా నన్ను సంగీతంతో ఏడిపించగలిగితే నేను అతన్ని "ఏ స్వరప్రయోగాలవల్ల (లేక ఏవిధమైన టెక్నిక్ ఉపయోగించి) నన్ను ఏడిపించగలిగావు?" అని అడగను. శాస్త్రం అట్లా కాదు. ఎవరైనా కర్ర పెట్టెలో జీవం ఉన్నదని నిరూపిస్తానని యంత్రాలూ అవీ తెచ్చి ఎక్స్‌పెరిమెంటు ఏర్పాటుచేస్తే, "ఏంచెయ్యబోతున్నావు? ఎట్లా నిరూపించబోతున్నావు?" అని అడ్డుప్రశ్నలు వేస్తాను. ఏప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయినా, "ఈ నిరూపణ అశాస్త్రీయంగా ఉంది" అనటానికి నాకు అర్హత ఉంది; అతను చెప్పింది నాకు అర్థంకాకపోతే "నువ్వు అర్థంచేసుకోలేవు, వెళ్లు" అనటానికి అతనికి అధికారం ఉంది.

కాని కళావిదుడు "నాప్రదర్శనంలో ఉన్న కళ నువ్వు తెలుసుకోలేవు" అనటానికి ఏమధికారం ఉందో నాకు బొత్తిగా బోధపడటంలేదు.

కళ అనేమాటే నిరర్థకంగా ఉపయోగించబడుతుంటే అంతకంటేకూడా అర్థం లేకుండా వాడబడుతున్నది "కళోపాసన" అనే మాట. "భూతదయ" "ధర్మబుద్ధి" అన్నట్టు. ప్రతివాడూ నాకు భూతదయ చాలా ఉంది అనటానికి వల్లపడదు. నీదయతో ప్రసక్తిలేని భూతాలున్నై. నీదయకు పాత్రములు కాని భూతాలున్నై! మానవత్వమూ, దేహబలమూ ఉన్నతమైన స్థితిలో ఉన్నవాడు అవాట దేశకాలపాత్ర లెరిగి వాడితే బాగుంటుంది. గుడ్డివర్రారుగా ధర్మబుద్ధి చూపించబోతే ప్రమాదం జరగవచ్చును. కళోపాసన అంటే ఏజాతి కళయొక్క ఉపాసన? కళలో జాతులున్నై మరి "అ" అని అంటూ గొంతుమీద కొట్టుకుని పిల్లలను భయపెట్టటం మొదలుగా పాషాణహృదయాలను సహితం లోకహితార్థం ద్రవింపచేయుటం వరకూ అనేకములైన కళలు ఉన్నై. రతిక్రీడను వర్ణించి అవతలవాడికి కామోద్రేకం కలిగించవచ్చును. ముద్దుపళని రాసిన చెత్తరాతకు కూడా ఇటువంటి శక్తి ఉంది. ఒకడికి కామోద్రేకం కలిగించటం కాని మరోవిధంగా వాడి స్వార్థపత్వాన్ని రేపటం కాని మంచి కళయొక్క లక్షణం కాదు. మనిషి యొక్క జీవయాత్రకు అనేకదారులున్నై. అందులో "ఈ దారిన వెళ్లితేనే నువ్వు మానవత్వాన్ని ముందుకు చేరవేసినవాడివవుతావు" అని మతం ఒక దారి చూపుతుంది. కళ ఎప్పుడైతే మనిషిని ఆ దారిలోనే ఉంచాలని చూస్తుందో అప్పుడది సత్కళ. అటువంటి కళ అందరిచేతా ఉపాసింపబడదగును. వేదాంతికి మంచేమిటి చెడేమిటి అనిపించవచ్చును. కాని ప్రతిక్షణమూ కొన్ని గ్రహించి కొన్ని విసర్జించుతూ జీవించేవాళ్లకు మంచిచెడ్డలు ఉండితీరాలి.

కళాస్వరూపం సామాన్యమానవుడికి దురూహ్యమైనది కాదు. కళను గ్రహించే శక్తి దాదాపు ప్రతివాడిలోనూ ఉంది. కళను తాము మాత్రమే గుర్తించగలిగినట్టూ ఎంతో సంస్కారం ఉంటేనే గాని అది సాధ్యంకానట్టూ నటించేవాళ్లు పచ్చి దొంగలు. [illegible] లోవుండి నాటకం చూడటం అలవాటైన వాడికి కొంతకాలానికి ప్రేక్షకులలో ఉండి నాటకం చూడటం నామోషీ అయినట్టు ఒకసారి టెక్నిక్ గురించి తెలుసుకోవటం మొదలుపెట్టినతరవాత కళను ఆనందించటం మీద గౌరవం తగ్గుతుంది. దేశమంతటా [illegible] వంటి ఆచారమే అయినతరవాత కళ అంటే ఏమిటో తెలి[illegible] నాట్యకళోపాసకుడు కావటానికి సంవత్సరమూ, గానకళోపాసకుడు కావటానికి నాలుగేళ్లూ, చిత్రకళోపాసకుడు కావటానికి ఇరవైపాఠాల పోస్టల్ కోర్సు (ఎంతకాలంపట్టినా సరే!) సాహిత్యకళోపాసకుడు కావటానికి ఒక సాహిత్యపత్రికలో ఒకవ్యాసం పడటానికి ఎంతకాలం పట్టితే అంతకాలం!

# వ్యాఖ్యానములు

## తల్లివాడినుంచి జారిపోయిన ఆంధ్రులు

"ఆంధ్రనాయకు లనేకులు, ఆంధ్రరాష్ట్రసమస్యనుండి తమ దృష్టిని మరల్చి, అఖిలభారతవిషయములయందు నిమగ్నులై యుండుటయే యీసమస్య వెనుకబడుటకు ముఖ్యకారణము"

లండను వెళ్లివచ్చిన తెనుగురాజబారులకు నాగేశ్వరరావుపంతులుగారు చేసిన విందు సందర్భంలో జరిగిన సభలో, రావుసాహేబు గానాల రామమూర్తిగారు ఇలా అన్నప్పుడు, వేమవరపు రామదాసుపంతులుగారు అంతఆవేశం పొందడంయేంమిటో బోధపడడం లేదు.

నిజంగా, పంతులుగారు, ఈమాటకు సమాధానం చెప్పవలసిన బాధ్యత వహించడాని కేమీ అవకాశం కనపడదు.

ఏమంటే! పంతులుగారు దేశభక్తులే. కాంగ్రెస్సంటే వారికి గౌరవభావం వుండడం కూడా నిజమే; కాని వారు కాంగ్రెస్సులో లీనమయిపోయినవారిలో చేరలేదు. కాంగ్రెస్సు మార్గంలో కూడా నైనా—కద్దరు విషయంలో వారు పడ్డ పాటేమీ లేదు. వారు లాటీదెబ్బలు తినలేదు. జెయిలుకి వెళ్లలేదు. జరిమానాలకు ఒప్పలేదు. వకీలువృత్తి విడిచిపెట్టలేదు.

కాంగ్రెస్సుశిబిరంలో వారికి స్థానం లేనే లేదు.

అలాంటి అవస్థలకు పాల్పడినవా రాసభలో అనేకులుండగా—అంతా చల్లచల్లగా వూరుకునే వుండగా, ఏదో మర్మాఘాతం తగిలినట్లు రామదాసు పంతులుగా రొక్కరే అంత తీవ్రంగా మాట్లాడడంలో యేమీ ఔచిత్యం లేదు.

"శ్రీబొబ్బిలి రాజాగారిని, సర్. కూర్మా వెంకటరెడ్డినాయుడు గారిని రౌండుటేబిలు రాయబారులనుగా మన మంపితిమి. తిరిగివచ్చి, స్వలాభాపేక్షతో తమిళులతో చేరి, వారే మనకు ప్రతికూలురైరి" అన్నారు రామదాసుపంతులుగారు. అయితే: జస్టిస్సుపక్షంవారిమీద రామదాసుపంతులుగారికీ, కాంగ్రెసాంధ్రులకూ ఎప్పుడైనా హృదయపూర్వకమైన సద్భావం వుందా?. అసలు వారిమీద వీరికి విశ్వాస మెలా కలిగిందీ?

అసలు ఇదంతా యేమిటంటే? బార్డోలీ సత్యాగ్రహ విజయమే ప్రధానంగా భావించి, కాంగ్రెసాంధ్రులు, ఆంధ్రరాష్ట్రసమస్యను నిర్లక్ష్యం చేశారు. అధికారులలో తమకు పలుకుబడివుంది కనక; ఆంధ్రరాష్ట్రం అత్యవసరం అని స్పష్టంగా తెలుసును కనక; లండనులో దానికి కావలసిన పరిష్కరించతగ్గ ప్రయత్నాలు సాగించి, ఇంతలో తమకు స్థానం కలిగించడానికి కాంగ్రెస్సువారు చేసే ప్రయత్నాలూ, వారివల్ల లేవనెత్తిన ప్రాతికూల్యమూ—వీటికి జంకి, జస్టిసాంధ్రులు కూడా ఆంధ్రరాష్ట్రసమస్యను జారవిడిచారు.



జరిగిందిదీ. ఇప్పటికి కూడా రంగస్థలంమీద వున్న నాటకం యిదీ.

పోని, తాము జస్టిస్సుపక్షంలో చేరలేదు కదా, కాంగ్రెస్సు కూడా దూరందూరంగానే వున్నారు కదా, రామదాసుపంతులుగా రేనా ఈ విషయంలో ప్రజలకు ప్రబోధమూ, సర్కారులో ఆందోళనమూ ఎందుకు చేశారు కాదూ?

మొత్తానికి, ఈరెండువర్గాలవారూ కూడా ఆంధ్రజాతిని కుంగదీశారు; గాని బలపరచలేదు. ఈ రెండువర్గాలవారూ కూడా తల్లివాడినుంచి జారిపోయారు; గాని ఆమె పాదాలు నమ్ముకుని వుండలేదు.

ఈ రెండుపక్షాలకూ అతీతులుగా వున్న రామదాసుపంతులుగారున్నూ అలాంటి పనే చేశారు. అలాంటి సత్కీర్తినే పొందారు.

రామదాసుపంతులుగారు, జస్టిసాంధ్రులు "తమిళులతో చేరి వారే మనకు ప్రతికూలురై"రన్నారే! తమిళులతో చేరినా జస్టిసాంధ్రులు పక్షనాయకత్వం తమ ఆధీనంలోనే వుంచుకోడం నాగ రెరుగుదురా? కాంగ్రెసాంధ్రులు తమలో అసెంబ్లీలో మాట్లాడతగ్గవారు లేక, మన కాళ్లకింద గోతులు తవ్వీన—తవ్వుతూనే వున్న సత్యమూర్తిగారికి పట్టం కట్టడం కూడా నా రెరుగుదురా? ఇంతే కాకుండా, నేటివరకూ, కాంగ్రెసాంధ్రులకు, గాంధిగారి తరవాత రాజగోపాలాచారి సత్యమూర్తిగార్లే మహానాయకులుగా వుండడం కూడా వారు గమనిస్తున్నారా?

ఈ ముఖపిధానాలు మనకి ఉచ్చులు కాని మరేమీ కావు. ఈ పులుముడు మనకి వత్తుమందు కాని మరొకటి కాదు.

ఏది యేమైనా—ఎవరేమన్నా, అమాయకులయిన ఆంధ్రుల వోట్లతో పైకి వస్తూవున్న జస్టిసాంధ్రులూ, కాంగ్రెసాంధ్రులుకూడా ఆంధ్రజాతికి మోక్షం కలిగించరు. కలిగించలేరు.

మనకు మోక్షం కలగా లంటే—తక్కిన పరగణాలవారితో సమానంగా అభివృద్ధి పొందడానికి తగిన సౌకర్యాలు కలగాలంటే ఈరాజకీయపక్షాలవారిని దూరంగా వుంచి యువకులు నడుములు కట్టాలి.

ఆంధ్రరాష్ట్రాన్ని ప్రత్యేకించే సన్నివేశాలు బ్రిటిషుగవర్నమెంటులో పుష్కలంగానే వున్నాయని రాయబారులు శుభవార్త చెబుతున్నారు.

ఆంధ్రయువకులారా! ఆంధ్రమాత, అందివచ్చిన కొడుకులు చూపించిన నిర్లక్ష్యానికి గుండెలు పగిలి, మీకేసి దీనంగా చూస్తోంది.

ఇంకా లేవరూ?

## ఆంధ్రులుగా నిలవబడండి. అంతే

మొన్నటి అయిదో తేదీని, కడపపట్నంలో. రెండో 'రాయలసీమమహాసభ' జరిగింది.

కోటిరెడ్డిగారూ, హరిసర్వోత్తమరావుగారూ, శ్రీసాధనపత్రికా, మరికొందరు ప్రముఖులూ ఈసభవిషయంలో తీవ్రమైన వైముఖ్యం ప్రకటించారు. ఇది సక్రమమైనది కాదనీ, వ్యక్తులకే గాని, సీమకు సంబంధించినది కానే కాదనీ స్పష్టంగా వెల్లడించారు.

అయినా కార్యనిర్వాహకులు సభ జరిపితీరారు.

చిత్తూరు జిల్లాకు చెందిన శ్రీ. టి. ఎన్. రామకృష్ణారెడ్డిగారు అధ్యక్షత వహించారు.

ముఖ్యంగా, ఆంధ్రజాతీయతకు భంగం కలిగించే తీర్మానాలు చెయ్యబడ్డాయి.

ఉత్తర సర్కారులమీద అపనమ్మకం పూర్తిగా చూపించబడ్డది.

ఆహ్వానసంఘాధ్యక్షుని మాటలూ, అధ్యక్షుని మాటలూ, తీర్మానాలూ ఉదహరిస్తూ చర్చలు సాగించడం నిరుపయోగమైన పని.

ఇక వున్నదల్లా యేమిటంటే? ఆంధ్రవిశ్వవిద్యాలయం విషయంలో, సర్కారులవారు, రాయలసీమను నిర్యోగమాటంగా మోసపుచ్చారు. ఈ వుల్లి రాయలసీమవారిని క్షణక్షణమూ, అడుగడుక్కీ కెలకరిస్తూనే వుంది.

సాహసించి, సర్కారుల ప్రముఖులు, రాయలసీమకు వెళ్ళి, వారిని సముదాయించకుండా మూలమూలల యిరకడానికిదే కారణం.

దెబ్బతిన్న రాయలసీమవారు, సర్కారులవారిని ముద్దుపెట్టుకోరు. నిజమే. కాని, అరవలను నమ్ముకోడం వారికిన్ని ఆత్మహత్య.

ఎప్పటికైనా, రాయలసీమకు సర్కారులూ, సర్కారులకు రాయలసీమా తప్ప మరి వేరే గతి లేదు.

కాదని ఎవరేం ప్రగల్భాలు కొట్టినా, అవి మర్మస్పృక్కులై జాతిని కుంగతీస్తాయి; కాని మరేమీ కాదు.

ఆంధ్రవిశ్వవిద్యాలయానికీ, ఆంధ్రరాష్ట్రానికీ ప్రాతికూల్యం చూపించడానికి సమకూర్చబడ్డ యీసభలో జస్టిస్సు వాసన కొట్టడం పూర్తిగా అనుచితం.

ఎక్కడి ఆంధ్రు లయినా సరే— ఆంధ్రజాతీయతవిషయంలో అనుకూల్యం చూపించడంలో నయినా, ప్రాతికూల్యం కనపర్చడంలో నయినా రాజకీయాలను తాకడం వ్యవహారజ్ఞానం లేకపోడానికీ పైపెచ్చు ఇప్పటి మన రాజకీయప్రగమనశీలతను బట్టి ఛాందసాన్యానికీ గుర్తు.

హిందువులకు కాంగ్రెస్సు లాభదాయకం కావచ్చు, కాకపోవచ్చు. జస్టిస్సుపక్షం మద్రాసీలకు ప్రయోజనకారి కావచ్చు; కాకపోనూ వచ్చు; కాని నేటి స్థితిలో ఈ రెండూ కూడా ఆంధ్రులను పీల్చేస్తున్నాయి. పిప్పి చేసేస్తున్నాయి.

రోజులు గడిచిన కొద్దీ సర్కారులవారికి పూచీ పెరిగిపోతోంది.

రాయలసీమకూడా జాతీయత నిలుపుకోవలసివుంది.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు

అగస్టు ౨౮, ౨౯ తేదీలలో, అమలాపురమున, ఆంధ్రసాహిత్యపరిషత్తు ౨౮ వ వార్షికోత్సవం జరిగింది.

ఇది, నిరుడు, బందరులో జరుగుతుం దని అనుకున్నారు. చివరికి ఈ సంవత్సరం అమలాపురానికి బదిలీ అయింది.

మహాపండితులు, శతావధానులు, మాధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులవారు అధ్యక్షత వహించారు.

అధ్యక్షులు వ్యావహారికాంధ్రాన్ని నిరసించా రని కథుకు. పరిషత్తు దృష్టిలో, అధ్యక్షత వహించడానికి ఆచార్యులవారికి గల ప్రధానార్హత యిదే.

రావుసాహెబు. గిడుగు రామమూర్తిపంతులుగారు ఈ క్షణందాకా—యింకా కృతకాంధ్రాన్ని చీల్చిచెండాడుతూనే వున్నారు. నిమిషనిమిషానికీ వ్యావహారికాంధ్రరచయితల సంఖ్య పెరిగిపోతూనే వుంది.

ఇలాంటి స్థితిలో రెండో పక్షానికి చెందిన ఆచార్యులవారు వ్యావహారికాంధ్రాన్ని నిరసించడం సామాన్యధర్మమే.

కాని పరిషత్తు, గ్రాంథికంలో నైనా ఏమీ పనిచెయ్యలేకుండా వుండడం ఆచార్యులవారు గుర్తించారా?

మొత్తానికి పరిషత్తు చరిత్రలో ఆచార్యులవారి అధ్యక్షత ప్రకాశమాన మైన వొక చిన్నివేశం; కాని ఆచార్యులవారి చరిత్రలో మాత్రం ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవాధ్యక్షత లెక్కకువచ్చేది కాదు.

## ఆంధ్రస్వరాజ్యపక్షం

గుంటూరిలో దేశావర్థకంగా కనపడిన ఆంధ్రరాష్ట్రనిర్మాణం, డాక్టరు. మూంజీగారికి, బెజవాడలో ధర్మసమ్మతంగానూ, ఆత్యావశ్యకంగానూ కనపడింది.

ఇంతకంటే విచిత్ర మైన సంగతి యేమిటంటే? ఆంధ్రస్వరాజ్యపక్షంద్వారా, గుమ్మిడిదల సుబ్బారావుగారు, ఏకకాలంలోనే స్వరాజ్యమూ, ఆంధ్రరాష్ట్రమూ సాధించబూనుకున్నారు.

స్వరాజ్యం యెవరికీ చేదుకాదు. అయితే; యిది ప్రాప్యంగా పెట్టుకున్న ఆంధ్రస్వరాజ్యపక్షానికి తెనుగుదేశంలో నైనా ప్రచారం యేమీ కనపడదు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు బతికివుంటే, యిప్పుడాయన తెనుగుయువకుల నందర్నీ యేకతాటిమీదకి తీసుకురాగలిగివుందురు. నిజమే; కాని ఆయనపేరు చెప్పి సుబ్బారావుగారిప్పుడా పనే చెయ్యబోతే సాధ్యపడుతుం దని తోచదు. సుబ్బారావుగారు పండితులూ సేవలు చెయ్యగలవారూనూ అంటే మేము కాదనము; కాని స్వల్పకాలంలో గోపాలకృష్ణయ్యగారు సంపాదించగలిగిన పలుకుబడిలో సగంకూడా ఇన్నాళ్లకు సుబ్బారావుగారు సంపాదించలేక పోయారు.

పైగా; మనదేశాని కిప్పుడు కొత్త రాజశాసనం తయారయింది. అది "అసంతృప్తికర" మని యెవరెంతగా పెద్దలు విరిచినా,

చివరి కందరూ దాన్ని అనుసరించి ప్రవర్తిస్తారు. ఇప్పుడు తెనుగు దేశంలో జస్టిసూ, కాంగ్రెసూ—ఈరెండు రాజకీయపక్షాలూ చాలా బలంగా వున్నాయి. ఇందులో జస్టిస్సుపక్షానికి దొరతనంలో మంచి పలుకుబడివుంది. చేతిలో కావలసినంత అంగబలమూ, అర్థబలమూ వున్నాయి. కాంగ్రెస్సుపక్షానికి ప్రజలలో మట్టుకయినా విశేష మయిన పలుకుబడివుంది. ప్రజలహృదయాలను స్వాధీనపరుచుకోడంలో దానికి మంచి చాతుర్యం వుంది. ఈరెండుపక్షాలూ ...త్తకాసనా న్ననుసరించి శాసనసభల కెగబాకుతాయి. ఒకటి ...డిపోయినా, రెండూ సమాన మయినా, కొద్ది భేదాలలో నిలవ...లిగినా ఈరెండుపక్షాలకే శాసనసభలలో స్థానం. సుబ్రాయన్ గారి ...ంటి దొల్లుబుచ్చుకాయ లెవ రేనా వుంటే కొద్దిమంది వారు కూడా వుం...వచ్చు. కాని ఆంధ్రస్వరాజ్యపక్షం, శాసనసభలలో, బల మైన ...నం సంపాదించగలుగుతుం దని చెప్పడానికి వల్లకాదు.

ఇంతే కాకుండా; స్వరాజ్యమూ, ఆంధ్రరాష్ట్రమూ—ఇవి ...ండూ ఒక పోరులో యిమిడే కిస్తులు కావు. ఆంధ్రరాష్ట్రం దొర...నంవారితో సహకారం చేస్తేనే సాధ్యపడుతుంది. స్వరాజ్యఫలం ...ప్పుడు ఆంధ్రస్వరాజ్యపక్షంవారు నిర్వచించిన విధంగా కూడా ...నికి ప్రతికూలమార్గంలో కార్యక్రమం నడిపిస్తుంది. "దేశమునందలి కాంగ్రెస్సు మున్నగు రాజకీయ కక్షలతో సంప్రదించి, ప్రస్తుత ...ర్లమెంటు సంస్కరణలను తీవ్రముగను, ఐకకంఠ్యముతోను, ...ట్చు"—ఆంధ్రస్వరాజ్యపక్షంవారి కార్యక్రమం యిదైతే వారు ...రాష్ట్ర ప్రస్తావన వదులుకోడం చాలా అవసరం.

...దేశంలో నిరాకరణపక్షంకంటే, సహకారపక్షం పెద్దది ... చాలా బలంగానూ వుంది. అంచేతనే పర్లాకిమిడిరాజాగారు ...ష్ట్రాన్ని సాధించగలిగారు. ఆంధ్రభూభాగాన్ని కూడా ...ంచగలిగారు. సింధును విడదీయించుకోగలడానికి మాహ...ులకు గల సౌకర్యం కూడా సహకారమే. మనలో కాంగ్రె...రు నిరాకరణం అవలంబించినా, దానితో పోటీ చెయ్యగల ...పక్షం పూనుకుంటే ఆంధ్రరాష్ట్రం మనకి సిద్ధించి తీరును. ...ప్రెసిడెన్సీ మొత్తంమీద గల పరిస్థితులు వారిని ఆంధ్రరాష్ట్ర...త్నం విడిచిపెట్టేటట్టు చేశాయి.

...ం చెప్పవలసివస్తే, వచ్చే యెన్నికలలో, ఆంధ్రస్వరాజ్య... జస్టిస్సుకాంగ్రెస్సుపక్షాల ప్రళయతాండవంలో పూర్తిగా ...తుంది. పైగా కొద్దిభేదాలతో కాంగ్రెస్సుమార్గమే అవలం...ప్పుడు కాంగ్రెస్సుండగా మరో పక్షం బయలుదేరడం ...మూ కాదు, బయలుదేరినా పని చెయ్యలేదు.

## ...రు పండితులు

...నెలలో గొప్ప తెనుగుపండితు లిద్దరు—కసుపర్తి మార్కండేయశర్మగారూ— అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ కీర్తిశేషులు ...ం ఆంధ్రభాషకూ, ఆంధ్రవాఙ్మయానికీ—తద్వారా ఆంధ్ర జాతికీ పెద్దదెబ్బ.

కీర్తిశేషు లిద్దరూ సంస్కృతాంధ్రాలలో దిగ్గంతులవంటివారు. తమ విజ్ఞాన మంతా ఆంధ్రవాఙ్మయంలో నిక్షిప్తం చెయ్యడంలో నిద్రాహారాలు కూడా విడిచిపెట్టి పనిచేసినవారు. ఇద్దరూ కూడా అసంఖ్యాకశిష్యవర్గం తయారుచేసినవారు.

నవ్యాంధ్రజాతీయనిర్మాణంలో తమ రక్తమాంసాలు ధారపోసిన వారు కనక వారు ఇద్దరూ ధన్యులే.

కాని, జాతికి, వారు లేనిలోటు ఇంతలో తీరేది కాదు. కీర్తిశేషుల బంధువర్గానికి మా సానుభూతి విన్నవించుకుంటున్నాము.

## ఊర్ధ్వగమనం కాదు

టి. రాఘవాచార్యులుగారు టాకీపటంలో నటించబోతున్నారు.

మొట్టమొదట మనకు వారి దర్శనభాగ్యం కలిగించే ఫిలుము ద్రౌపదీమానసంరక్షణం.

అయితే; ఆచార్యులుగారు, టాకీలో నటించబోయే ఉత్సాహోద్రేకంవల్ల విచక్షణత మరిచిపోయినట్టు తోస్తుంది.

దీనివల్ల ఫిలుము చాలా బాగా తయారు కావచ్చు. దానికి ప్రజల ఆదరం కూడా అధికంగానే సమకూడవచ్చు. ఆ ఫిలుము తీసే లక్ష్మీఫిలుము కంపెనీకి మంచి లాభం కిట్టవచ్చు.

అంతే కాని ఈమాత్రం భాగ్యానికి రాఘవాచార్యులుగారు తెర మీద యెక్కడంలో ఔచిత్యం లేదు.

ఇందులో, రాఘవాచార్యులుగారు, తమ విద్యాధికతను గమనించలేదు. ఆంధ్రనటులలో తమకు గల ఉన్నతస్థానాన్ని గుర్తించలేదు. దక్షిణదేశపునటు లందరూ తమ్ము మాత్రమే నటరాజుగా పూజిస్తూ వుండడం తెలుసుకోలేదు. ఖండాంతరాలకు వెళ్లి, అక్కడి మహానటుల ప్రతిభ గ్రహించి, తమ చాతుర్యం వారికి కనపరిచి, మన్ననలు పొందివచ్చిన తమ విశిష్టతను నిలుపుకోడం లేదు.

ఆంధ్రదేశంలో ఆదర్శనాటకశాల నిర్మించబూనుకున్న తమ ప్రత్యేకతను కూడా వారు స్మరించుకోడం లేదు.

ద్రౌపదీమానసంరక్షణంఫిలుమువల్ల ఆచార్యులుగారు దక్షిణదేశానికి—ముఖ్యంగా తెనుగుజాతికి యేమి సందేశం యివ్వగలరూ?

ఫొటోగ్రఫీసంబంధ మైన మాయలవల్ల ద్రౌపది చీరలు అక్షయం కావడం మొదలైన చమత్కారాలు ఆ ఫిలుములో అనేకా లుండవచ్చు. కాని రాఘవాచార్యులుగారు నటించకపోయినా అవింతలకు లోటుండదు.

తెనుగుజాతి యిప్పుడు దారీ తెన్నూ తోచక తికమకలు పడుతోంది. మనకు ఆంధ్రత్వాన్ని బలపరిచే ఘట్టాలు మన దేశచరిత్రలో యెన్నో వున్నాయి. ఇప్పుడు మన సంఘంలో మనలను కుంగతీస్తూ వున్న దురలవాటులు అపారంగా వున్నాయి. వాటినీ, వీటినీ చూపించే నాటకాలాడి—ఫిలుముల కెక్కించి, రాఘవాచార్యులుగారు, అనుగుణాలను మనకు అబ్బచెయ్యడానికీ, దురాచారాలను విడిచిపెట్టేటట్టు చెయ్యడానికీ పూనుకుంటే యెంత బాగుండును! కాని; "గతానుగతికో లోకః"

ఆచార్యులుగారు, సువర్ణం పేటాడడమే గొప్పగా భావించే ఫిలుం డైరక్టరు చేతిలో యిరుక్కున్నారు......ఏంచెయ్యడమూ!

## హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం

మేము ౧౯౩౮ జులైలో హిందీకి ప్రతికూలప్రచారం ప్రారంభించాము. అగస్టు నెలలో భారతి సంపాదకులు మావాదాన్ని బలపరుస్తూ సంపాదకీయం ప్రకటించారు. దాన్ని అనువదించి తమ పత్రికలో ప్రకటించి, కర్నాటక సాహిత్యపరిషత్తువారు, తమ పత్రికద్వారానూ, సమావేశాలద్వారానూ హిందీని తీవ్రంగా ప్రతిఘటిస్తూ మంచి ప్రచారం చేస్తున్నారు.

౧౯౩౫ ఏప్రిల్ సంచికలో (ఇరవయ్యోసంపుటం వొకటో సంచిక కర్నాటక సాహిత్యపరిషత్పత్రికలో) సంపాదకులిలా రాశారు)

"గతసంచికలో మేము కన్నడము, ఇంగ్లీషు, హిందీ—ఇవి ఉన్న—ఉండతగిన స్థానం మీద అయినవాటిని గురించి వ్రాసితిమి కదా? ఆ విషయంలో యిప్పుడు కొన్ని యింగ్లీషుకన్నడపత్రికలలో ఈ విషయానికి సంబంధించిన కొన్ని అభిప్రాయాలు వెలువడినవి. కొందరు మహాశయులు తమ సొంతఅభిప్రాయాలు ప్రకటించారు వాటిలో కొన్ని ముఖ్యమైనవాటిని కన్నడులకు విశదం కావడంకోసం యిక్కడ ప్రకటిస్తున్నాము.

మండ్య కర్ణాటకసంఘము ౧౦–౧౦–౩౮ మొ॥ ౧౬–౧౦–౩౮ వరకు నడిచిన సప్తాహకార్యక్రమంలో హిందీవిషయాన్ని గురించి ప్రస్తావన ఇట్లున్నది.

స్త్రీలు—హిందీ. ఇక్కడ ఆడుపిల్లలు హిందీని నేర్చుకొంటూ ఉండడం అందరికీ తెలిసినవిషయమే. అట్లా హిందీ నేర్చుకోడానికి ఆశించడం రాష్ట్రసేవాదృష్టికి సమంజసంగానే కనపడవచ్చును కాని అది కన్నడభాషకు ఏర్పడినిగాని తొందర కాగూడదు ఆడుపిల్లలు కన్నడ భాషకు ఎంతప్రోత్సాహం ఈవచ్చునో అంత ప్రోత్సాహాన్ని ఈవలెను. మొదట తమ భాష సేవ చేయవలెను. స్త్రీలు కన్నడం విషయంలో హెచ్చు అభిమానం చూపుదురుగాక. కన్నడ భాషాశిశువును వారి ఒడిలో పెట్టుచున్నాము. వారి పోషణలో శిశువు చక్కగా వృద్ధిపొందును గాక

కర్నాటక సాహిత్యపరిషత్పత్రిక, కన్నడ పత్రికలలోనుంచీ, ఇంగ్లీషు పత్రికలలోనుంచీ కన్నడప్రముఖుల ఉపన్యాసాలలోనుంచీ యింకా అనేకభాగాలు ప్రకటించివుంది వాటని క్రమంగా ప్రకటిస్తాము.

మా ఆంధ్రసోదరులు వన దేశస్థితీ, భాషావాఙ్మయాలస్థితీ బాగా గ్రహించి హిందీముగ్ధులవలలో పడకుండా వుంటారని నమ్ముతున్నాము. — సంపాదకుడు

### ఒక సవరణ

కడచిన ప్రబుద్ధాంధ్ర సంచికలో నేను వ్రాసిన వ్యాసమునకు 'అఖిలభారత సాహిత్యపరిషత్తు—ఆంధ్రులు' అని ఉండవలసిన శీర్షిక కారణాంతరాలచేత అన్యథాగా పడింది వ్యాసమంతను చదివినట్టయితే ఆంధ్రులు అఖిలభారత సాహిత్యపరిషత్తుకు దూరంగా ఉండవలెనన్నది ఉద్దిష్టవిషయం కావట్టు స్పష్టమే. ప్రధానంగా మనం ముందు మన వాఙ్మయమును పెంపొందించు కోవాలనేదే నా ఉద్దేశము

మ. సోమశేఖరశర్మ

## ఆధునికాంధ్రవాఙ్మయం—తరవాయి

| | | | |
|---|---|---|---|
| **నరహరిశెట్టి వెంకటరత్నంగారివి** | | | |
| ఆంధ్రహృదయము | ౦ | ౮ | ౦ |
| **మంగిపూడి వేంకటశర్మగారివి** | | | |
| మద్దుకత | ౦ | ౮ | ౦ |
| నిరుద్ధభారతము | ౦ | ౬ | ౦ |
| బాలవితంతువిలాపము | ౦ | ౪ | ౦ |
| **కస్తూరి పాలెం కృష్ణారావుగారివి** | | | |
| వివేకానంద నాటకము | ౦ | ౧౨ | ౦ |
| మల్లెపూలు | ౦ | ౧౨ | ౦ |
| వ్యాసమంజరి | ౦ | ౧౨ | ౦ |
| ఆంధ్రదేశము మొదటిభాగం (యూనివర్సిటీ పోటీకి | ౦ | ౧౨ | ౦ |
| ఆంధ్రదేశము రెండవభాగము గెల్చిన నవల) | ౦ | ౧౨ | ౦ |
| **పెనుమర్తి వేంకటరత్నంగారివి** | | | |
| రత్నాపణము (ఖండకావ్యాలు) | ౦ | ౮ | ౦ |
| **త్రిపురనేని రామస్వామిచౌదరిగారివి** | | | |
| సూతపురాణము ద్వితీయాశ్వాసము | ౧ | ౦ | ౦ |
| సూతపురాణము చతుర్థాశ్వాసము | ౧ | ౦ | ౦ |
| కురుక్షేత్ర సంగ్రామము | ౧ | ౦ | ౦ |
| శంబుకవధ (ఉత్తరరామచరిత) | ౦ | ౧౨ | ౦ |
| కుప్పుసామిశతకము | ౦ | ౨ | ౦ |
| వివాహవిధి | ౦ | ౧ | ౦ |
| **ఆంధ్ర శేషగిరిరావుగారివి** | | | |
| కేయూరబాహు చరిత్రము (వచనము) | ౧ | ౮ | ౦ |

కళాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి.

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి * * * రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్న చిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0—4—0 చందాదారులు ఒకేసారి రు 7—8—0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజిస్టర్డు పార్సిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

11 ప్రేమసుందరి 1 8 0
12 చోరశిఖామణి 1 8 0
13 లక్ష్మీప్రసాదము 1 8 0
14 హత్యారహస్యము 1 8 0
15 ఫాస్టు (1 భాగము) 1 8 0
16 ఫాస్టు (2 వ భాగము) 1 8 0
17 కుముద్వతి 1 8 0
18 చిన్నకోడలు 1 8 0
19 రహస్యభేదనము 1 8 0
20 సింహగడము 1 8 0
21 మణిహారము 1 8 0
22 మొగలాయిదర్బారు (1 వ భాగము) 1 8 0
23 ఘటనాచక్రము 1 8 0
24 రాజసుందరి 1 8 0
25 కుంకుమభరణి 1 8 0
26 జాగిలము 1 8 0
27 మొగలాయిదర్బారు (2 వ భాగము) 1 8 0
28 సరస్వతి 1 8 0
29 ఆనందాభాయి 1 8 0
30 హత్యాన్వేషణము 1 8 0
31 మొగలాయిదర్బారు (3 వ భాగము) 1 8 0
32 XoX 1 8 0
33 మొగలాయిదర్బారు (4 వ భాగము) 1 8 0
34 కోహినూరు 1 8 0
35 ఆటీన్ మణేలా 1 8 0
36 అపరిచిత 1 8 0
37 అంతఃపురము 1 భా॥ 1 8 0
38 అంతఃపురము 2 భా॥ 1 8 0
39 అగ్రహారము 1 8 0
40 ఛిన్నహస్తము 1 భా॥ 1 8 0
41 ఛిన్నహస్తము 2 భా॥ 1 8 0
42 కంకణరహస్యము 1 8 0
43 సంజీవి 1 భా॥ 1 8 0
44 సంజీవి 2 భా॥ 1 8 0
45 వ్రజరాణి 1 8 0
46 హత్యాభ్రమ 1 8 0
47 కాశీఖండము 1 8 0
48 సేవాశ్రమము 1 భా॥ 1 8 0
49 సేవాశ్రమము 2 భా॥ 1 8 0
50 దాసీకన్య 1 8 0

## అనుబంధములు

1 మృత్యురంగిణి 0 12 0
2 అభాగిని 0 12 0
3 ఛద్మవేషి 0 12 0
4 విదురుని యూవ దేశములు 1 0 0
5 కాంచనమాల 1 0 0
6 సీమంతిని 1 0 0
7 సుశీల 1 0 0
8 శశిరేఖ 1 0 0
9 యమునాబాయి 1 0 0
10 శ్యామల 1 0 0
11 కాంతంకథలు (చిన్నకథలు) 1 0 0
12 కాలసర్పి 1 0 0
13 భారతకథాసారం 1 0 0
14 కథాకల్పవల్లి (చిన్నకథలు) 1 0 0
15 అరక్షణీయ 1 0 0
16 మాధవి 1 0 0
17 లలిత 1 0 0
18 పెండ్లిదండ 1 0 0
19 కథావళి 1 0 0
20 నాలుగుకథలు 1 0 0
21 నీతిప్రబోధిక 1 0 0
22 ఆదర్శము 1 భా॥ 0 12 0
23 ఉదంకుడు 0 12 0
24 భేతాళకథలు 0 12 0

## నాటకములు

1 మార్కండేయ 0 12 0
2 అహల్యాశాప విమోచనము 0 12 0
3 మేవారుపతనము 1 0 0
4 వరమాల 1 0 0
5 షాజహాను 1 0 0
6 నూర్జహాను 1 0 0
7 దుర్గాదాసు 1 0 0
8 చంద్రగుప్త 1 0 0
9 దంపతులు 1 0 0
10 విజయవిజయం 1 0 0
11 భక్తకుచేల 1 0 0

**చిత్రమూలము** :—చిత్రక - అగ్ని — Plumbago zeylanica. ఎఱ్ఱని చిత్రమూలము—Plumbago Rosea.

**స్వరూపము**

ఇది రమారమి 2 గజముల యెత్తువరకును బెఱుగును. ఇది క్షుపజాతిలోనిది. దీని కాండము సాపుగా నుండును. ఆకులు చిన్నతమలపాకులను బోలి యుండును. వానికంటె కొంచెముగుండ్రముగా నుండును. ఆకులు విడివిడిగా నుండును. దీని కుత్తరేణువంటి వెన్నులు బయలుదేరును. నక్కిరికాయలవలె నవి బట్టలకు పట్టుకొనును. వేరు పొడవుగను చిదుగగొట్టిన పసుపురంగుగను యుండును. దీనిలో ఎరుపు, తెలుపు, పసుపువచ్చరంగుల భేదముతో మూడు జాతులు కలవు. పూవుల రంగులబట్టియు, కాండముయొక్క స్వల్పమగు రంగును బట్టియు జాతిని నిర్ణయించుకొనవలయును. దీని యితరాంగములకంటె వేరునకే ప్రాశస్త్యముకలదు.

**గుణములు**

దీనివేరు మిక్కిలి కారపురుచి గలది. వేడిచేయు స్వభావము గలది. విపాకమునగూడ కారపురుచిగనే యుండును. వాతకఫములను పోగొట్టును. వాతోదరమును, గ్రహణీరోగమును, మూలశంకలను నిర్మూలించును. పాండురోగమును, క్షయయును హరించును. క్రిములను, దురదలను పోగొట్టును. ఎఱ్ఱచిత్రమూలమునకును, నల్లచిత్రమూలమునకున్ను యించుమించుగ నివియే గుణములుకాని కొన్ని విశేషగుణములుకూడ కలవు. ఈ రెండును గూడ రసమును బంధించును. లోహస్వర్ణీకరణమునందుగూడ వాడుదురు. నల్లచిత్రమూలమునకు వెండ్రుకలను నల్లపరుచు గుణముకలదు. పాలలో వేరు వేసిన పాలు నల్లబడుననిగూడ చెప్పుదురు. మొత్తమున నీ రెంటును అమూల్యద్రవ్యములు.

**ప్రయోగములు**

ఉబ్బులకు :— చిత్రమూలవు ఆకులు తరిగి కూరగా వండిపెట్టిన ఉబ్బులు తగ్గును. (వంగసేన, శోధ. చి.)

గ్రహణికి :—చిత్రమూలము పెద్దములకలయొక్క తోరమును వారమురోజులు స్రవింపజేసి పిమ్మట దానిని దీసి దానికి రెండురెట్లు ఆవునేతిలో కలిపి వాని ఘృతపాకముగా కాచి సేవించిన జఠరదీప్తిని గలిగించి గ్రహణీరోగమును నివారించును.

మేదోరోగమునకు :—చిత్రమూలముయొక్క వేరు చూర్ణము తేనెతో సేవించుచు హితభోజనుడైయున్న మేదోరోగములు హరించును. (వంగసేన, మేదోధికారమున)

బోదకాలునకు :—చిత్రమూలవు వేరు ముద్దగాని, దేవదారుగాని లేక రెండును గాని పైన లేపనము జేసిన గుణకారిగా నుండును.

రసాయనార్థం :—నలుపు యెఱుపురంగులు గల చిత్రమూలములలో దేనిని గాని వేరుతీసి నీడను యెండించి చూర్ణమును జేసి ఆచూర్ణమును నేతితోగాని లేక నెయ్యి తేనె కలిపిగాని లేక పాలతోగాని అదియును లేనిచో నీళ్లతోగాని యొక మాసమురోజులు సేవించి హితాన్నాశనుడగుచో రోగములు లేకుండ నిస్సంశయముగా నూరు సంవత్సరములు జీవించును. మంచినూనెతో తీసుకొనిన దుస్తరమైన వాతములను గూడ హరించును. గోమూత్రముతో సేవించిన అసాధ్య కుష్ఠరోగములును, బొల్లియు నివారణమగును. మజ్జిగతో త్రాగిన మూలశంఖలు మొదలగు గుదరోగము లన్నియు హరించును. (వాగ్భటము 36. అ. ఉ. స్థానము)

మూలశంఖలకు :—చిత్రమూలమును, శొంఠియు కలిపి సీధుమద్యముతో పానము జేసిన మూలశంఖలు హరించును. (చరకము)

కఫకాసలకు :—చిత్రమూలవు వేరును, తెల్లబాడిద వేరును బెరడులను మాత్రమే గ్రహించి నీళ్లతో నూరి రసముతీసి పొంగించి దానిలో తేనె కలిపి యిచ్చిన దారుణములైన కఫకాసలు శమించును. చిత్రమూలవువేరు వంటికి తాకిన నిప్పువలె పుండగును. చితుగని వ్రణములను గాని, గ్రంథులనుగాని పుండగుటకై చిత్రమూలమును పైన రాయుదురు. చిత్రమూలము గర్భిణీస్త్రీలకు వాడకూడదు. గర్భస్రావమును గలిగించును. పైన లేపనము చేయుటవలన పక్వముగాని వ్రణములు పక్వమగుటయు, పక్వవ్రణములు చిదుగుటయు గలుగును.

# అమృతాంజనము



అన్ని నొప్పులను

బాధలను కుదుర్చునని

తమకు తెలియును

అయిన తెలియవలశిన దేది !




నేడు దేశమంతటను కుక్కగొడుగుల వలె తలలెత్తిన నకలు మందుల చూచి మోసపోకుండుటయే !

బజారులలో కొనుటకు పూర్వము మా ట్రేడు మార్కు గుర్తులన్నిటిని జాగ్రత్తగా పరిశీలించుడు.